శ్రీరస్తు

# దశరూపకసంగ్రహము

అను

# నాటకప్రక్రియ

మహాకవి ధనికుడు రచించిన దశరూపకమును

శ్రీ కొమాండూరు అనంతాచార్యులు

తెనిఁగించినది



చెన్నపురి:

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్సు వారిచే

ప్రకటితము.

 [Price. 1-0-0

# ఆంధ్రవ్యాకరణములు, అలంకారములు

| | | రూ. | అ. |
|---|---|---|---|
| | ప్రతి 1-కి | రూ. | అ. |
| ఆనందరంగరాట్ఛందము | ... | 1 | 8 |
| ఆంధ్రభాషాభూషణము, పద్యకావ్యము | ... | 0 | 6 |
| ఆంధ్రశబ్దచింతామణి, సటీక | ... | 0 | 12 |
| ఆంధ్రశబ్దమంజరి బ॥ సీతారామాచార్యులు | ... | 0 | 8 |
| కవిజనసంజీవని | ... | 0 | 8 |
| కవిసంశయవిచ్ఛేదము | ... | 1 | 4 |
| పట్టాభిరామపండితీయము, (పద్యవ్యాకరణము) | | 0 | 8 |
| ప్రశ్నోత్తరాంధ్రవ్యాకరణము | ... | 1 | [illegible] |
| ప్రౌఢవ్యాకరణము, బ॥ సీతారామాచార్యులు | | 1 | [illegible] |
| ,, సటీక, బులుసు వేంకటరమణయ్య | .. | 3 | [illegible] |
| బాలచంద్రోదయము అలఘుకౌముది | ... | 0 | [illegible] |
| బాలవ్యాకరణము, శ్రీచిన్నయసూరిగారిది | ... | 1 | [illegible] |
| ,, శ్రీధూళి రామమూర్తిగారిటీకతో | ... | 6 | [illegible] |
| ,, విద్వాన్ బులుసు వేంకటరమణయ్యగారిలఘుటీక | | 2 | [illegible] |
| రావిపాటి గురుమూర్తిశాస్త్రిగారి తెలుగు వ్యాకరణము (ప్రాచీనము) | ... | 1 | 8 |
| లఘువ్యాకరణము | ... | 1 | 0 |
| విభక్తిచంద్రిక | ... | 0 | 6 |
| వెంకయ్యవ్యాకరణము | ... | 0 | 6 |
| వ్యాకరణసంగ్రహము | ... | 0 | 8 |
| సులక్షణసారము, తాత్పర్యసహితము | ... | 1 | 8 |

శ్రీరస్తు

# దశరూపకసంగ్రహము

౧౦౮

## నాటకప్రక్రియ

ఇది

ధనికుడను మహాకవిచే సంస్కృతమున రచింపఁబడిన
దశరూపకమునుండి సంగ్రహించి
శ్రీ కొమాండూరు అనంతాచార్యులు
వచనపఙ్క్తిని వెలిఁగించినది



వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచే
ప్రకటితము.

# పీఠిక

పూర్వీకులైన మనవారు ఏకారణముచేతనో సంస్కృతమునందువలె నాంధ్రమునందు నాటకాది రూపకగ్రంథములను పద్యగద్యాత్మకములుగా రచియింపరైరి. అందుల కనుగుణముగా గావ్యాలంకార సంగ్రహకారుఁడును దాను మాతృకగా గ్రహించిన ప్రతాపరుద్రీయమునందలి నాటక ప్రకరణమును వదలి తక్కినభాగమునే తెనిఁగించెను. అట్టుండ నిప్పటికి ఇరువది సంవత్సరములనాఁడు అనఁగా క్రీస్తుశకము 1871 సంవత్సరమున ఇప్పుడు చెన్నపురి సర్వకళాశాలయం దాంధ్రపండితులుగా నుండువారును అనన్యకవితా సామ్రాజ్య ధురంధరులు నగు బ్రహ్మశ్రీ కొక్కొండ వేంకటరత్నము పంతులవారు "నరకాసురవిజయవ్యాయోగము" అను రూపకమును తెనిఁగించి [illegible]ము నిరాఘాట కవిత్వధోరణిం బేరెన్నికగన్న వారును ప్రస్తుతము రాజమహేంద్రవరము కాలేజిలో నాంధ్ర

పండితులుగా నుండువారునైన బ్రహ్మశ్రీ కందుకూరి వీరేశలింగముపంతులుగారు లోనగు పండితులు కొందఱు శాకుంతలము మొదలుగాఁగల కొన్ని నాటకములను దెనిఁగించిరి. అట్లు తెనిఁగింపఁబడిన యారూపక ప్రబంధములు కాలక్రమమునఁ జెన్నపురి యూనివర్సిటి విచారణాధ్యక్షుల యాదరమునకుఁ బాత్రములై యిప్పుడిప్పుడు F.A పరీక్షకుఁ బాఠ్యపుస్తకములుగా నంగీకరింపఁ బడుచుండుట యెల్లవారు నెఱిఁగిన విషయమే కదా. అట్టి యా రూపకములను జదువు విద్యార్థులు వాని లక్షణములను బాఠనసమయములందు యథోచితముగా నుపాధ్యాయులు చెప్పుచున్నను స్పష్టముగాఁ దెలిసికొనేరక పరీక్షకు లడిగెడి ప్రశ్నములకుఁ గొన్నిటికి నుత్తరములు వ్రాయనేరక తత్తఱిల్లు చున్నారు. ఈవిషయము నాకనుభవైక వేద్యమగుటఁ బట్టి యట్టివిద్యార్థుల యుపయోగార్థము సంస్కృతము నందు ధనికుఁడను మహాకవిచే రచియింపఁబడిన దశరూపమను గ్రంథమునుండి సంగ్రహించి "దశరూపక సంగ్రహము," అను పేర నీనాటక ప్రక్రియను వాక్యరూపమున బాలురకు సులభముగాఁ దెలియఁదగిన

తేటమాటలతో వ్రాసినాఁడను. ఇం దుదాహరించిన యుదాహరణములు దశరూపమునం దుదాహరింపఁ బడిన రత్నావళి వేణీసంహారము మొదలగు వాని లోని శ్లోకార్థములే గాని యితరములు గావు.

ఇందు విద్యార్థులకు సులభముగాఁ దెలియుటకై కొన్ని యెడల సంధిలేక వ్రాయఁబడియుండును.

నేను సంస్కృతభాషాపరిజ్ఞానము లేనివాఁడ నగుటఁబట్టి వ్యాకరణాదిశాస్త్రపరిశీలన పటువులై కావ్యనాటకాలంకారపాఠనపటువులై శ్రీమత్తిరు వహీంద్రపురీవాస్తవ్యులై విద్వత్సంస్తవ్యులై వెలయు శ్రీమాన్ ఇళయవల్లి కుప్పనయ్యంగార్లను వేఁడు కొనఁగా వారు నెయ్యంబుమీఱ సహాయులై దీనిం బరిష్కరించిరి.

ఇందు దోషంబులు విశేషంబులై కనుపట్టునేనియు వీటిం బాటింపక పాలుఁ గ్రోల దివురుకలహంసంబులుఁ బోలె వానిం బాటింపక గుణలేశైకగ్రాహులై స్వీక రింప సర్వజ్ఞులగు దోషజ్ఞులం బ్రార్థించెద.

మీఁద నుదాహరించిన చొప్పునఁ బ్రయత్న పూర్వకముగ వ్రాసి ముగించిన యీ గ్రంథమును

వెంటనే యచ్చువేయింప యత్నించియు నందులకు ధనముకూడక తడఁబడుచున్న వాస్థితిని విచారించి కరుణించి ఘనతవహించిన చెన్నపురి ప్రెసిడెన్సీ మేజస్ట్రీటు అధికారమును వహించి, ఆంధ్రభాషాభిమానులై మహారాజరాజశ్రీ బ్రహ్మశ్రీ న్యాయవిరాజితులై వెలయుచుండెడి C G కుప్పుసామిఅయ్యగారు వలసిన ద్రవ్యము నిప్పించి ముద్రింపఁజేసి నన్ను ధన్యుం గావించిరి.

ఇట్లు, విద్వద్విధేయుండు.

కొ. అనంతాచార్యులు.

# శ్రీ కొమాండూరు అనంతాచార్యులుగారి
# జీవిత సంగ్రహము

ఈ దశరూపకసంగ్రహమును రచించిన శ్రీ కొమాండూరు—అనంతాచార్యులుగారు సుప్రసిద్ధ విద్వాంసులు. వీరి పూర్వులు నెల్లూరుజిల్లా గంగవరం గ్రామములో నివసించియుండుటవలన వీరికి గంగవరం శ్రీవైష్ణవులు' అనే వాడుక ప్రసిద్ధమయినది. శ్రీ అనంతాచార్యులుగారు ముప్పదియేండ్లకుఁ పైగా మద్రాసులో నుండిన చెర్చ్ ఆఫ్ స్కాట్లండు మిషన్‌వారి కళాశాలలోను, ఆమీఁద రాజధానీ కళాశాలలోను ఆంధ్రాధ్యాపకులుగా నుండి విద్యాబోధనచేయుచు, పెక్కు గ్రంథములను సంస్కరించి, వాని ప్రకటనకుఁ దోడ్పడుచు, విధి,విరామము లేకుండ భాషాసేవ నొనర్చెడివారు.

శ్రీ అనంతాచార్యులుగారు తిరువత్తూరు హైరోడ్డులో, శ్రీ చదలువాడ సుందరరామశాస్త్రిగారి యింటి కెదురుగా కాఁపురముండెడివారు. ఎల్లపు

డును తెల్లని దుస్తులను ధరించుచుండెడివారు. వీరి దినచర్య చాల విచిత్రమైనది. ఉదయము ఎనిమిది గంటలలోగా స్నానసంధ్యాదులను, భోజనమును ముగించుకొని కాలినడకను మౌంటురోడ్డులోని వైజయంతీముద్రాక్షరశాలకుఁ బోయి అక్కడిపని చూచుకొని, ఆమీఁద రాజధానీకళాశాలకు వెళ్లెడివారు. ఈయన ప్రొఫెసరు టి. ఎమ్. శేషగిరిశాస్త్రిగారికిని, పనప్పాకం అనంతాచార్యులుగారికిని వ్రాయసకాఁడుగా నుండుటయేగాక, వారు ప్రకటించు గ్రంథములు ప్రూఫులుదిద్దెడివారు. సాయంకాలము 4 గం. లకు కాలేజీని వదలి వైజయంతీప్రెస్సునకును, శ్రీ శేషగిరిశాస్త్రిగారి వద్దకును పోయి, వారి ప్రూఫులను పుచ్చుకొని 6గం లకు ఇల్లుచేరేవారు. సాయంకాలానుష్ఠానములు, భోజనము ముగించుకొని మిక్కిలి శ్రద్ధతో ప్రూఫుల నన్నింటిని దిద్దెడివారు. ఈయన ఆనందముద్రాక్షరశాలవారికి ఆంధ్రమహాభారతము, భాస్కరరామాయణము మున్నగువాని ముద్రణమున పూర్తిగా తోడ్పడిరి.

శ్రీ ఆచార్యులుగారు ప్రథమమున మాతంబ్రిగారి ఆదిసరస్వతీనిలయముద్రాశాలలోను, ఆమీఁద శ్రీసర

స్మృతి - తిరువేంగడాచార్యులుగారి సరస్వతీనిలయ ముద్రాశాలలోను తెనుగు కంపోజిటరుగా పని చేయుచు, కొంచెమైనను శ్రమలేకుండ ఒకఫారము పేటరు అచ్చుకూర్చెడివారు. ఈముద్రాశాలలలో వీరికి లభించిన అనుభవమువల్లనే పుస్తకములను వ్రాయుటకును,సాఫుప్రతులు తయారుచేయుటకును, ప్రూఫులు దిద్దిముద్రించుటకును అసమానప్రజ్ఞయేర్పడినది. ఆరోజులలో పుస్తకము దిద్దికొని, సాపు వ్రాసికొని, పేజీప్రూఫుచదివి యిచ్చినచో ఫారమునకు రూ 1. ఇచ్చెడివారు. వీరికి శ్రీ శేషగిరిశాస్త్రి గారివలన షడప్పాకంవారివలన, ఆనందప్రెస్సువలన అట్లే లభించెడిది.

నేను కొంతకాలము శ్రీఅనంతాచార్యులు గారి వద్ద రఘువంశములోని 2-3 సర్గలు చదివితిని. ఈయన తమకు చేసినసాహాయ్యమునుగూర్చి శ్రీబహుజనపల్లి సీతారామాచార్యులవారు తమ "శబ్దరత్నాకరము" లో ఇట్లు తెలిపియున్నారు—

'అటుతరువాత సంస్కృతాంధ్రపండితులైన శ్రీ. శ్రీ. అనంతాచార్యులు వ్రాయసమునకు కుదిరి యత్యంతశ్రద్ధతో నిర్భరప్రయాసము పుచ్చుకొని

నిర్విఘ్నముగ నీ గ్రంథముఁ బరిసమాప్తిఁ బొందించిరి.

వాస్తవమునకు శ్రీసీతారామాచార్యులుగారు శబ్దరత్నాకరమును రచింపలేదు. శ్రీ చదలువాడ సీతారామశాస్త్రిగారే దానిని రచించిరి. శ్రీ శాస్త్రిగారు దాని చిత్తుప్రతిని తాము పనిచేయుచున్న రాజధానీ కళాశాలలో తమ డస్కులో భద్రముగా నుంచియుండఁగా, శ్రీసీతారామాచార్యులుగారు దానిని పుచ్చుకొని శ్రీఅనంతాచార్యులుగారిచేత పాపు వ్రాయించి ప్రూఫులు చదివింపించి, దిద్దించి, ఈ నిఘంటువునకు రూపము కల్పించిరి. శ్రీసీతారామాచార్యులుగారు రసికానతంసులు. తఱచు సంగీత కచ్చేరీలలోను, నాట్యకచ్చేరీలలోను కాలము గడపెడివారు. ఆయనకు ఇట్టి శ్రమసాధ్యమైన పనిచేయుటకు ఓపిక తక్కువ.

శ్రీ వేదం వేంకటరాయశాస్త్రి గారికి శ్రీఅనంతాచార్యులుగారిపయి అసూయ, కోపము ఉండెడివి. కారణమేమనఁగా శ్రీ శాస్త్రిగారికి జీతము రూ 60 మాత్రమే. శ్రీఅనంతాచార్యులు గారి జీతము రూ. 80 లు. మరియు నీయన రాత్రి 2 ఘారములు, ఉద

యము 2 ఫారములు ప్రూఫులు దిద్ది ఆవిధముగా నెలకు రూ. 120 లు ఆదనముగా సంపాదించెడివారు. శ్రీశాస్త్రిగారి కట్టి ఆదాయము లేకపోయేది. కావు వనే శ్రీశాస్త్రిగారు ఈయన పరిష్కరణములను ఆక్షేపించుచు, శ్రీగోమఠం శ్రీనివాసాచార్యులుగారు ప్రకటించుచుండిన 'సూర్యాలోక' పత్రికలో విమర్శలు వ్రాసేవారు.

శ్రీఅనంతాచార్యులుగారి అల్లుడు నేలటూరు శేషాచార్యులుగారు. ఈయన కొంతకాలము చెర్చి ఆఫ్‌స్కాట్లండు మిషను కాలేజీలో లెక్చెరరుగా ఉండి, తరువాత B L ప్యాసయి హైకోర్టు వకీలుగా నుండిరి. మామగారు చనిపోయిన కొద్దికాలమునకే వీరును మరణించిరి.

శ్రీఅనంతాచార్యులుగారు పయిరీతిగా పెక్కువిధముల భాషావాఙ్మయసేవలో ఇతరులకు తోడ్పడుటయే కాక స్వయముగ పెక్కుగ్రంథములను రచించిరి. పెద్దనామాత్యుని మనుచరిత్రమునకు పెద్ద వ్యాఖ్యను రచించిరి. సత్యసేన విజయము, అయిదుగురు దొంగలకథలు, ఉత్తరహరిశ్చంద్రవచనము, దశరూపకసంగ్రహము వారిరచనలు. వేణీసంహార

మును కొంతవఱకు మాత్రమే రచించిరి చాల యేండ్లు పాఠ్యగ్రంథభాగములకు టీకలను రచించే వారు.

శ్రీ అనంతాచార్యులు గారి జీవితవిశేషములు చాలమందికిఁ దెలిసియుండవు. కావున నిప్పుడు ఈ విషయములను తెలుగు ప్రపంచమునకు తెలియ జేసి నందులకు గర్వపడుచున్నాను.

రూపకలక్షణములను సులభ పద్ధతిలో తెలియఁ జేయు గ్రంథములలో నిది సాటిలేనిది. శ్రీమల్లాది సూర్యనారాయణశాస్త్రిగారి 'ఆంధ్రదశరూపకము' కంటెను మిన్న. దీని నాంధ్రలోకము ఆదరించి మా ప్రయత్నము సఫలమొనర్చునుగాక.

# విషయసూచిక

## పూర్వభాగము

# ఉత్తరభాగము

## సంస్కృతనాటకములు

| | ప్రతి 1-కి రూ | అ. |
|---|---|---|
| ఉత్తరరామచరిత్రము, సవ్యాఖ్యానము ... | 2 | 8 |
| ప్రహసనము, కాళిదాసకృతము ... | 0 | 6 |
| శాకుంతలనాటకము, సవ్యాఖ్యానము ... | 4 | 0 |

## చంపువులు

| | | |
|---|---|---|
| భారతచంపు సవ్యాఖ్యానము ... | 3 | 0 |
| రామాయణచంపు సవ్యాఖ్యానము .. | 3 | 8 |
| విశ్వగుణాదర్శచంపు ... | 2 | 8 |

## తర్క, వ్యాకరణ, అలంకారగ్రంథములు

| | | |
|---|---|---|
| అభినయదర్పణము సాంధ్రతాత్పర్యము ... | 1 | 4 |
| ఆంధ్రీకృతన్యాయదర్శనము ప్రథమభాగము | 1 | 4 |
| చంద్రాలోకము సటీక ... | 1 | 8 |
| తర్కసంగ్రహము, సవ్యాఖ్యానము ... | 1 | 4 |
| తిఙన్తమంజరీ, ధాతుమంజరీ .. | 0 | 8 |
| న్యాయకుసుమాంజలి, ఆంధ్రతాత్పర్యసహితము | 3 | 0 |
| ప్రతాపరుద్రీయము, సవ్యాఖ్యానము ... | 4 | 8 |
| భరతరసప్రకరణము, సాంధ్రతాత్పర్యము ... | 0 | 12 |
| శబ్దమంజరి, శుద్ధప్రతి ... | 0 | 12 |
| ,, (నాగరలిపి) చిన్నసైజు ... | 0 | 12 |
| సభారంజని (నాట్యశాస్త్రము) ... | 1 | 0 |

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,

పోస్టుబాక్సు 1372. 292, ఎస్ప్లనేడ్, చెన్నపురి. 1

శ్రీరస్తు

# దశరూపకసంగ్రహము

అను

# నాటకప్రక్రియ

## పూర్వభాగము

క. శ్రీదంబై వస్తురసా
హ్లాదంబై సాంగసంధిముఖ్యాస్పదమై
యీ దశరూపకసంగ్రహ
మాదశరూపక సుసంగ్రహంబయి వా వెలయున్.

అ. నాటకము అనఁగా నాట్యము ప్రధానముగాఁ గల గ్రంథవిశేషము, అది చూడఁదగినది గనుక రూపము అనియు, రాముఁడు మొదలగువారియవస్థను (రీతిని) తనయందుఁ గలుఁగఁ జేసికొని నటుఁడు వర్తించుటకలది కనుక రూపకము అనియుఁ జెప్పఁబడును. ఇట నాటకమునకు ఉపకారకమైన నాట్యము యొక్క స్వరూపము తొలుత వివరింపఁబడును.

౧. ధీరోదాత్తాది నాయకానుకృతి నాట్యము.

అభినయముచేత శృంగారాదిరసములకు ఆశ్రయు లయిన ధీరోదాత్తుఁడు మొదలగునాయకులయునికిని అనుకరించుట నాట్యము.

## ౧. అభినయమాంగికాది భేదంబులచేఁ జతుర్విధము.

అభినయము = అవయవముల కదలిక మొదలగువానిచేతఁ దెలియఁ జేయఁదగిన యర్థమును దెలియఁ జేయుట. అది ఆంగికము, వాచికము, సాత్త్వికము, ఆహార్యము అని నాలుగు భేదములు గలది. (ఆంగికము=అంగములచే నయినది. వాచికము=వాక్కులచే నయినది. సాత్త్వికము = సత్త్వముచే నైనది—ఇట సత్త్వము అనఁగా ఒకరిని పొందిన సుఖదుఃఖాదులు తన్నుఁ బొందినట్లు భావించెడి మనసుకలిమి. ఆహార్యము=ఆభరణాదులచే నైనది.)

౨. ఇట నాట్యప్రసంగవశమువలన నృత్యనృత్తములును నిరూపింపఁబడియెడి.

## ౩. కేవలభావాశ్రయము నృత్యము.

కేవలము భావమునకుఁ జోటయినది నృత్యము అని అర్థము. (భావము = రసాభిజ్ఞానయోగ్యత - అనఁగా రసము పొడఁగెడి తెలివి. కావ్యముచేతనైనను అభినయముచేతనయినను దెలియఁ జేయఁబడెడి రాముఁడు మొదలుగాఁగల ధీరోదాత్తాది నాయకుల సుఖదుఃఖములో నగువాని యనుభవమువలని వాసనారూపమయిన సంస్కారమనఁబడెడి సామాజికజనమనోవికారము అని కొందఱు.)

## ౪. తాళలయాశ్రయము నృత్తము.

తాళమునకును లయకును జోటయినది నృత్తము అని యర్థము. (తాళము = పాటపాడునప్పుడు దానికిఁదగినట్లు

చేతులు తట్టుట మొదలగునది. లయ = నృత్యగీత వాద్యముల సమభావము.)

నృతిధాతువునకు గాత్రవిక్షేపము (దేహమును గదలించుట) అర్థమగుటవలన రసవిషయమును (శృంగారాదిరసమే విషయముగాఁగలదియు) ఆంగికబహుళమును (అంగములకదలిక మొదలగువానివలని యభినయమే తఱచుగాఁ గలదియు) అగునది నృత్యము. గాత్రవిక్షేపార్థకత్వముచేత సమాన మయ్యును అనుకారాత్మకత్వముచేత (అనుకరించుటకలది యగుటచేత) నృత్యము నృత్తమునకంటె వేఱయ్యెను. నటధాతువునకుఁ గించిచ్చలనము (కొంచెము కదలుట) అర్థమగుటవలన రసవిషయమును సాత్వికబహుళమును (సాత్వికాభినయమే తఱచుఁగాఁగలదియు) అగునది నాట్యము. మఱియు వాక్యార్థాభినయముగలది నాట్యమును పదార్థాభినయముగలది నృత్యమును అగుటఁబట్టి నాట్యమునకంటె నృత్యము అన్యమయ్యెను.

౫. నృత్యనృత్తములు మార్గము దేశి యనఁబడు.

పదార్థాభినయాత్మకమైన నృత్యము మార్గ మనియు అట్టిది కాని నృత్తము దేశి యనియుఁ జెప్పఁబడును.

౬. మధురోద్ధతభేదముచే నా రెండును లాస్యము తాండవము నాఁబడు.

ఆనృత్య నృత్తములు రెండును దిన్నఁదనముతో నాడునెడ లాస్య మనియు నిక్కుతో (ఎగిరి దుంగిరి దాంట్లువేయుచు) ఆడునెడ తాండవము అనియుఁ జెప్పఁబడును. అనఁగా నృత్యము

గాని వృత్తముగాని తిన్నఁదనముతో వర్తించునెడ లాస్యమనియు నిక్కతో వర్తించునెడ తాండవ మనియుం జెప్పఁబడు నని తాత్పర్యము.

ఇట్టి భేదములుగల నృత్యనృత్తములు నాటకాదులందు ఉచితరీతి నుపయోగింపఁబడును.

## ౭. వస్తు నేతృ రస భేదమువలన రూపకము దశవిధము.

వస్తువు, (కథ) నేత (నాయకుఁడు) రసము (శృంగారాది రసము) ఇవి భేదించుటవలన రూపకము పదివిధములుగలదిగా చెప్పఁబడుచున్నది. అవియనఁ, నాటకము ప్రకరణము భాణము ప్రహసనము, డిమము, వ్యాయోగము, సమవాకారము, వీథి, అంకము, ఈహామృగము అనఁబడును. వానికీ భేదము వస్తు భేదముచేతను నాయక భేదముచేతను రసభేదముచేతను గలుగు చున్న దని భావము.

## ౮. వస్తు వాధికారికము ప్రాసంగిక మని ద్వివిధము.

రూపకమునకు శరీరమువంటి దైనవస్తువు (కథ) అధికారికము అనియుం, ప్రాసంగికము అనియు రెండువిధములు గలది. ఆ వస్తువు వృత్తము ఇతివృత్తము అనియుఁ జెప్పఁబడును.

## ౯. అందాధికారికము ముఖ్యము.

ఆ రెండువిధములయిన వస్తువునందును అధికారికవస్తువు ముఖ్యము. అది రామాయణమునందు సీతా వృత్తాంతమువంటిది.

## ౧౦. తదంగము ప్రాసంగికము.

ఆ ముఖ్యకథకు అంగమైన కథ ప్రాసంగికము. (ప్రాసంగికము = ప్రసంగమువలన వచ్చినది. ఇది రామాయణమునందు సుగ్రీవాదుల వృత్తాంతమువంటిది.)

## ౧౧. ఆధికారిక మధికారిచేతనే నధికారముచేతనేని నిర్వర్తింపనగు.

ముఖ్యమయిన యయ్యాధికారికవస్తువు అధికారిచేతనయినను అధికారముచేతనయినను కొనవేర్పఁదగినది అనగా ఫలపర్యంతము పొందింపఁదగినదని యర్థము. (అధికారము = ఫలమునకు సొంతముఁ దనము. అధికారి = అధికారముగలవాఁడు.)

## ౧౨. ప్రాసంగికము పరార్థప్రసంగమువలన స్వార్థసిద్ధిదము.

ముఖ్యవస్త్వంగమయిన ప్రాసంగికము ఒకరునికై ప్రవర్తించునపుడు తనపని కొనవేఁటుకలది.

## ౧౩. అది పతాక యని ప్రకరి యని ద్వివిధము.

ఆ ప్రాసంగికవస్తువు పతాక అనియు, ప్రకరి అనియు రెండు విధములు గలది.

## ౧౪. సానుబంధము పతాక, ప్రదేశభాక్కు ప్రకరి.

అనుబంధముతోఁ గూడినది అనఁగా రామాయణమునందు సుగ్రీవాదుల వృత్తాంతమువలె ముఖ్యకథయొక్క అనువర్తనము బహుదూరమువఱకుఁ గలది పతాక, ఒకచోటఁ బొందినది

అనఁగా శ్రమణాదుల వృత్తాంతమువలె ఒకానొకచోట కొంచెము అనువర్తనముగలది ప్రకరి యని అర్థము.

పతాకా ప్రసంగమువలన నిటు పతాకాస్థానకమును దెలుపఁబడియెడి.

ప్రస్తుతాగంతుభావవస్తువులయొక్క తుల్యసంవిధాన విశేషణముంగల యన్యోక్తిసూచకము పతాకాస్థానకము.

ప్రకృతకథతోడ హఠాత్తుగా వచ్చి చేరునట్టి కథయొక్క సరియైనవివరణముగల విశేషణములతోడి యన్యాపదేశపుమాటను సూచించునది పతాకాస్థానకము అనఁబడును.(అన్యాపదేశము = అప్రకృతమయిన యొక యర్థమును నిమిత్తముచేసికొని ప్రకృతమైన యర్థమును దెలియఁజేయునది) ఇది ప్రకరణవశముచే మీఁద రాఁగల యర్థమును దెలుపుటయందు పతాకవలెనే వర్తించునది గనుక దీనికి పతాకాస్థానకము అని పేరు గలిగెను. ఈ పతాకాస్థానకము తుల్యేతివృత్తత్వముచేతను, తుల్యవిశేషణత్వముచేతను అన్యోక్తి (అన్యాపదేశపుమాట)వలనను సమాసోక్తి (ప్రస్తుతమునందప్రస్తుతమును బోధించుమాట)వలనను రెండువిధములు గలదియగును.

ఉ. (1) రత్నావళియందు — ఓపద్మనయనా నాకు ఇవి పోవలసినసమయము నేను కోరెదను నీవు సుప్తవై నాచేతనే ప్రతిబోధింపఁదగినదానవు" అని తామరతీఁగ యనెడి ప్రియురాలిని ఊరడించుచున్నాఁడో యనునట్లు అస్తమస్తకనివిష్టకరుఁడయిన సూర్యుఁడు కానవచ్చుచున్నాఁడు. (పద్మనయన =

పద్మములబోడి కన్నులుగలది, పద్మములవంటి కన్నులుగలది. సుప్త = ముడుఁగుకొన్నది, నిద్రించినది. ప్రతిబోధింపఁ = వికసింపఁ జేయ, కేలఁగీలుకు అస్తమస్తకనివిష్టకరుఁడు = అస్తపర్వతముపైఁ జేర్పఁబడిన కిరణములుగలవాఁడు; త్రోయఁబడుటచే జాఱి నుంచఁబోఁబడిన చేతులుకలవాఁడు.)

(2) అర్ధములేని యుత్కలికలును మిక్కిలి తెల్లఁబాఱిన ముఖమును క్షణకాలమున మొదలుపెట్టఁబడిన జృంభలును అధికమయిన శ్వసనోద్గమములచేనైన యాయాసమును గల యీ యుద్యానలతను మన్మథవేదననొందిన యన్యస్త్రీని జూచునట్లు చూచుచున్న నేను రాణికి కోపావేశముచే మిక్కిలి ఎఱ్ఱవాఱిన ముఖమును గలుగఁజేయుచున్నాను. (ఉత్కలికలు = విక్కని మొగ్గలు, హెచ్చినకోరికలు. జృంభలు = వికాసములు; ఆవులింతలు, శ్వసనోద్గమములు = గాలిచే మీఁదికెగయుటలు, ఎగయూపిరి విడుచుటలు.)

౧౫. ప్రఖ్యాతోత్పాద్యమిశ్రభేదంబులవలన
వస్తువు మఱలఁ ద్రివిధంబు.

ఆధికారికత్వముచేతను ద్వివిధప్రాసంగికత్వముచేతను మూఁడు విధము లయిన యీ కథాశరీరము ప్రఖ్యాతము, ఉత్పాద్యము, మిశ్రము అని మఱియు మూఁడుభేదములు గలది యగును.

౧౬. ఇతిహాసాదులవలనిది ప్రఖ్యాతము.

పూర్వకవికథలనుండియు పురాణములనుండియుఁ బరిగ్రహించిన కథ ప్రఖ్యాతము (మహావీరచరితము మొదలగునది.)

## ౧౭. కవికల్పిత ముత్పాద్యము.

కవిచేత క్రొత్తగాఁ గల్పింపఁబడిన కథ ఉత్పాద్యము అనఁబడును. దీనిని కల్పిత మనియు నందురు. (మాలతీమాధవము మొదలగునది.)

## ౧౮. ఉభయసంకరము మిశ్రము.

ఆ రెంటియొక్క చేరికగలది అనఁగా ప్రఖ్యాతకథయును ఉత్పాద్యకథయును చేరినది మిశ్రము అనఁబడును.

(ఇట్టివస్తువు దివ్యము మర్త్యము మిశ్రము అని మూఁడువిధములు వర్తిల్లును. దివ్యము దేవతలది. మర్త్యము మనుష్యులది. మిశ్రము = ఆ రెండును గలిసినది.)

## ౧౯. అది శుద్ధము త్రివర్గదం బేకానేకానుబంధియగు.

ప్రఖ్యాతమయిన యావస్తువు ధర్మము, అర్థము, కామము అనెడి త్రివర్గఫలము నిచ్చునదియగు. అట్లు దానిచే నియ్యఁబడెడి ఫలము ఒక్కొక్కటియు ఒక్కొకదాని సంబంధమును రెంటిమూఁటి సంబంధమును గలది యగు. ఇది వస్తుస్వరూపనిరూపణము.

ఇఁకవస్త్వంగములు నిరూపింపఁబడును.

## ౨౦. బీజ బిందు పతాకా ప్రకరీ కార్యములు అర్థప్రకృతిపంచకము.

పైఁజెప్పినవస్తువునకు అంగములై కార్యసిద్ధిహేతువు లయిన బీజము, బిందువు, పతాక, ప్రకరి, కార్యము' అనెడి అర్థప్రకృతులు అయిదు గల వని యర్థము.

## ౨౧. స్వల్పోద్దిష్టమై యనేకవిధముల విస్తరిల్లెడి కార్యహేతువు బీజము.

వృక్షమునకు బీజము (విత్తు)వలె తొలుత కొంచెముగా నుద్దేశింపఁబడి పిమ్మట క్రమముగా బహువిధములచేత పెరిగెడి కార్యహేతువు బీజము అనఁబడును.

ఉ. రత్నావళియందు - వత్సరాజునియొక్క రత్నావళీ ప్రాప్తి యనెడి కార్యమునకు హేతువైన యౌగంధరాయణుని వ్యాపారము విష్కంభమునందే సూచింపఁబడెను.

యౌగంధరాయణుఁడు — సందేహమేల అనుకూలమైన దైవము ద్వీపాంతరమునుండియైనను, సముద్రమునడుమనుండి యయినను, దిక్కులకడలనుండియైనను కోరినపదార్థమును తెచ్చి యిచ్చును.”—ఇందు ఏలినవానివృద్ధికి కారణముగాఁ జేయఁబడిన యౌగంధరాయణుని ప్రయత్నము బీజము. వేణీసంహారమునందు - ద్రౌపది తలవెండ్రుకలు ముడుచుటకు హేతువైన భీమసేనునికోపాభివృద్ధివలని ధర్మరాజునుత్సాహము బీజము.

## ౨౨. అవాంతర ప్రయోజనావిచ్ఛేదము కారణము బిందువు.

ఒకకార్యమునకు మఱియొకకార్యముచేత విచ్ఛేదము (ఎడ కాటు) కలుగునప్పుడు దాని చెడతొఱఁగక నడుచునట్లు చేయుటకు హేతువైనప్రయత్నము బిందువు. ఇది యవాంతరబీజమునకు సంజ్ఞాంతరము. నీటియందు నూనెబొట్టువలె ప్రసరించునది యగుటచే దీనికి బిందువు అని పేరు కలిగెను.

ఉ. రత్నావళియందు.— నడుమ పొసఁగిన మన్మథపూజ యనెడి పనిముగియుటతో కథాప్రయోజనమునకు ఎడఁబాటు కలుగుచుండఁగా అనంతరకార్యమునకు హేతువైన "చంద్రుని పాదములను (కిరణములను) సేవించుచు (అనుభవించుచు) ఎదురు చూచునట్లు ఉదయనరాజు పాదములను (అడుగులను) సేవించుచు (కొలుచుచు) రాజు లెదురుచూచు చున్నారు" అనుమాట సాగరిక విని "ఏతఁడే మాతండ్రిచే నియ్యఁబడితినో అయ్యుదయన మహారాజా యీతఁడు" అనుకొనుటచేత జరుగవలసిన కథాప్రయోజనమునకు అది కారణమగుచున్నది.

## ౨౩. ఫలనిర్వాహము కార్యము.

ప్రధానఫలమునకు కాలవేర్పునదియు కడపటి కథకవయవమైనదియు నయినప్రయోజనము కార్యము

## ౨౪. ఆరంభ యత్న ప్రాప్త్యాశా నియతాప్తి ఫలాగమము లని ఫలార్థులచే ప్రారంభింపఁబడిన కార్యమున కవస్థలు అయిదు.

ఫలముఁగోరినవారిచేతఁ బ్రారంభింపఁబడునట్టి పనికి ఆరంభము, యత్నము ప్రాప్త్యాశ నియతాప్తి ఫలాగమము అని అయిదు అవస్థలు గలవు.

## ౨౫. మహాఫలము లభింప నగు నౌత్సుక్య మాత్ర మారంభము.

దీని నెట్లయిన నేను సాధింతు నని యేదేనియు నొకదార్థముకై యుత్సహించుట (పూనుట) ఆరంభము.

ఉ. రత్నావళియందు.—"విలసవానివృద్ధికిఁ గారణమయిన యీ ప్రారంభమునందు దేవుఁడును దోడుపడును." అనునది మొదలుగాఁ గలవాక్యముచేత వత్సరాజునకు యౌగంధరాయణునివలననైన సచివాయత్తసిద్ధియొక్క కార్యారంభము చూపఁబడెను.

## ౨౬. అది ప్రాప్తింపనియెడఁ జేయఁబడెడి త్వరతోఁ గూడిన వ్యాపారము ప్రయత్నము.

అయారంభమువలనఁ గోరినది కలుగకుండిన అది కలుగుటకై తగినయుపాయములను వెదకుట మొదలగు త్వరతోడివ్యాపారము ప్రయత్నము అనఁబడును.

ఉ. రత్నావళియందు — వత్సరాజు కూడికకొఱకైన చిత్తరువు వ్రాయుట మొదలుగాఁగల యుపాయములు. విదూషకుఁడు. ఇది తప్ప వేఱయిన యుపాయము లేదు గనుక చిత్తరువు వ్రాసి నీవు కోరినకార్యమును జేసెదను' అనునది మొదలగువానిచేఁ జెప్పఁబడెను.

## ౨౭. ఉపాయాపాయశంకలవలని ప్రాప్తి సంభవము ప్రాప్త్యాశ.

ఉపాయముచేతను అపాయశంకచేతను (ఏలిని తెలియవచ్చునను భయముచేతను) ఇది యిట్టిది నిశ్చయింపఁగూడని ఫలప్రాప్తి కల్లనైన యాశ ప్రాప్త్యాశ అనఁబడును.

ఉ. రత్నావళి మూఁడవయంకమునందు — వేషముమార్చుట ప్రియునిఁగూర్చిపోవుట మొదలయినకూడికకుఁ దగునుపాయము

యుండఁగా వాసవదత్తవలని యపాయశంకయు నయ్యెను. “అకాలపుగాలివానవలె వాసవదత్త వచ్చి చేతికొచ్చిటికిఁ దీసికొని పోవలెనఁగదా.” ఇత్యాదులచేత నిర్ధారణచేయఁ బడని యేకాంతపుఁగూడికయొక్క కలిమి చెప్పఁబడెను.

౨౮. అపాయములేమిని సునిశ్చితమయిన ప్రాప్తి నియతాప్తి.

తెలుపవచ్చు నపాయశంక లేక తెల్లగా నిశ్చయింపఁబడిన యేకాంతఫలముయొక్క ప్రాప్తి నియతాప్తి అనఁబడును.

ఉ. రత్నావళియందు:—విదూషకుఁడు సాగరిక జీవించుట దుష్కరము, అని కొందలపెట్టి, మన కేమి యుపాయము ఆలోచించితివి, అని యడిగింపఁగా, రాజు మిత్రుఁడా—రాణిని తెచ్చుటయే. అది తప్ప ఇప్పటికి మఱి యేయుపాయమును గానరాదు, అని పిమ్మటియంశము నర్థమునకు బిందువైన రాణి వలని యపాయమునకు ఆమెను తెచ్చుటచేత నివారణము చెప్పఁబడుటవలన నియతమైన ఫలప్రాప్తి సూచింపఁబడెను కనుక ఇది నియతాప్తి యయ్యెను.

౨౯. సమగ్రఫలసంపత్తి ఫలాగమము.

ఉ రత్నావళియందు—సిద్ధుఁడు చెప్పిన చొప్పున వత్స రాజునకు రత్నావళి లభించుటయు చక్రవర్తిత్వము సిద్ధించుట యును సమగ్రమైన ఫలముకలిమి.

సంధిపంచకస్వరూప నిరూపణము.

## 3౦. ఏకాన్వయమునందవాంతరైకార్థసంబంధము సంధి.

ఇందు సంధియనఁగా ఒక ప్రయోజనమునకు సంబంధించిన కథాభాగములకు మఱియొక ప్రయోజనముతోడి సంబంధము.

## 3౧. అర్థప్రకృతిపంచక మవస్థాపంచక సమన్వితం బగు నెడఁ గ్రమంబుగ ముఖాదిసంధిపంచకం బగు.

అర్థప్రకృతులు (కథాశరీరకారణములు) అయినబీజము బిందువు పతాక, ప్రకరి, కార్యము అనునివి యైదును గ్రమముగా అవస్థాపంచకము (ఒకఫలము సిద్ధించుటకై యేర్పడిన నాయక వ్యాపారరూపము లయిన యుపాయములయొక్క స్థితివిశేషము లైదు)అగు ఆరంభము, యత్నము, ప్రాప్త్యాశ, నియతాప్తి, ఫలాగమము, అను వానితోడఁ గూడునెడ ముఖము ప్రతిముఖము గర్భము, అవమర్శము, ఉపసంహారము అనెడిసంధులు అయిదు నగును అని యర్థము.

## 3౨. నానార్థరససంభవమైన బీజోత్పత్తి ముఖము.

అనేకములయిన ప్రయోజనములవలనను రసములవలనను కలిగినబీజముయొక్క యుత్పత్తి ముఖసంధి అనఁబడును (ఇందు బీజారంభములకు సంబంధము.)

## 33. బీజారంభసమన్వయమువలన దీని కుపక్షేపాదు లంగములు పండ్రెండు.

బీజముయొక్కయు ఆరంభముయొక్కయు సంబంధము (కూడిక)వలన నీముఖసంధికి ఉపక్షేపము పరికరము, పరిన్యాసము, విలోభనము, యుక్తి, ప్రాప్తి, సమాధానము, విధానము, పరిభావన, ఉద్భేదము, భేదము, కరణము అని పండ్రెండంగములు.

### (1) బీజన్యాస ముపక్షేపము.

ముందు చెప్పఁబడిన లక్షణముగల బీజమును నెలకొలుపుట యుపక్షేపము అనఁబడును.

ఉ. రత్నావళియందు — అనుకూలమైన దైవము ద్వీపాంతరమునుండియేనియు సముద్రమునడుమనుండియేనియు దిక్కులకడనుండియేనియు గోరినపదార్థమును శీఘ్రముగఁ దెచ్చి కూర్చును, అని తెరలోపల యౌగంధరాయణుండు వత్సరాజునకు రత్నావళి లభింపహేతువైన దైవానుకూల్యముగల స్వవ్యాపారమును (తనపనిని) బీజత్వముచేత నిందు స్థాపించెను.

### (2) దానిబాహుళ్యము పరికరము.

(దానిబాహుళ్యము = అబీజమువిస్తరిల్లుట.)

ఉ. రత్నావళియందు— అట్లుకానియెడ సిద్ధునియుపదేశము నందలి నమ్మికచేతఁ గోరఁబడినదియు ఓడపగులుటవలన సముద్రమునందు మునిఁగి తేలినదియునైన సింహళేశ్వరుని కొమార్తెను తెప్పకలక లభించుట యెక్కడ" అనుట మొదలు సర్వవిధములచేతను మన యేలినవానికి అభ్యుదయములు అగుచున్నవి." అనునది మొదలుగాఁగల వాక్యములచేత అబీజమే యిందు పెంచి చెప్పఁబడుటవలన నిది పరికరము.

### (3) బీజనిష్పత్తిపరిన్యాసము.

అబీజముయొక్క మొలవేయుట పరిన్యాసము అనఁబడును.

ఉ. రత్నావళియందు— ఏలినవానికి వృద్ధికి హేతువైన ఈ ప్రయత్నమునందు ఇట్లు దైవము వేయిచ్చి తోడుపడు

చుండఁగా దానిని మఱుమునందు సందేహము కలుఁగదు. ఇది సత్యము. అయినను రాజును తరువుకు వదయక సాయంత సేవ చేసినపని కై వెడలుచువాఁడనయ్యెద — ఇందుయౌగంధరాయణుఁడు దైవబలముచేత తనవ్యాపారము నెఱవేఱుటను చెప్పుటవలన ఇది పరిన్యాసము.

(4) గుణవర్ణనము విలోభనము.

బీజమునకు అనుగుణములైన గుణములను వర్ణించుట విలోభన మగు.

ఉ. ' సూర్యుఁడు అస్తమించుచుండఁగా సాయంతనసమయము నందు ఒక్కటిఁగొలువుకూటమునకు వచ్చిన రాజులసమూహము, కనుకందు వగుచు నుదయించుచున్న చంద్రునియొక్క కమలముల వికాసము నణఁచివేసెడిపాదములను (కిరణములను) సేవింప నెదురుచూచునట్లు, కన్నులకుఁ బందువై యొప్పెడి యుదయన రాజవైన నీయొక్క కమలముల కాంతి నణఁచివేయునట్టి పాదముల (అడుగుల) సేవింప నెదురుచూచుచున్నది. ' అని వైతాళికునివలనఁ జంద్రునిఁబోలిన వత్సరాజుయొక్క గుణ వర్ణనము చేయఁబడుటచే సాగరికసంగమమునకు హేతువైన యనురాగబీజమునకు అనుగుణమైన విలోభన మయ్యెను కనుక ఇది విలోభనము. (విలోభనము = ఆశపుట్టించుట.)

(5) అర్థసంప్రధారణము యుక్తి.

బీజప్రరోహణము యుక్తమయిన దని నిశ్చయించుట యుక్తి.

ఉ. రత్నావళియందు:— "ఈమెను నేను రాణిహస్తము నందు సన్నాహముతో నుంచితిని. అది యుక్తమే. కంచుకి యయిన బాభ్రవ్యుఁడును సింహళేశ్వరునిమంత్రి యయిన వసుభూతితోఁ గూడ ఎట్లో సముద్రమును దాఁటి కోసలదేశముమీఁద దండెత్తి పోయిన రుమణ్వంతునితోఁ జేరుకొనె నని వింటిని." అనుటచేత అంతఃపురమునం దున్న సాగరికను సుఖముగా వత్సరాజు చూచి సంతోషించుట మొదలగు ప్రయోజనములును, బాభ్రవ్యుఁడును వసుభూతియుం దనయేలినవానిఁ జేరుటకు హేతువును యౌగంధ రాయణునిచే నిశ్చయింపఁబడుటవలన నిది యుక్తి యయ్యెను.

(6) సుఖాగమము ప్రాప్తి.

సుఖముయొక్క రాక ప్రాప్తి యనఁబడును.

ఉ. రత్నావళియందు — ఆమాట విని సాగరిక సంతోషముతో వెనుకకుఁ దిరిగి వత్సరాజును అపేక్షతోఁ జూచుచు "నేనుమాతండ్రిచేత ఏరాజున కియ్యఁబడితినో అట్టియీమహారాజా యీయన. పరప్రేష్యతాదూషిత మయిన (ఒకరికొలువుచే నిందింపఁబడినదైన) నా బ్రతుకు ఈయన దర్శనముచేత ధన్యతను వహించెను." అనుటచే సాగరికకు సుఖాగమము అగుటవలన ఇది ప్రాప్తి యయ్యెను

(7) బీజాగమము సమాధానము.

బీజముయొక్క రాక(తోఁచుట) సమాధాన మనఁబడును.

ఉ. రత్నావళియందు —వాసవదత్త —అట్లయినపూజోపకరణములను దెమ్ము. సాగరిక —భట్టినీ! అన్నియు నివిగో సిద్ధముగ

యున్నది. వాసవదత్త—పరిశీలించిచూచి (తనలోనన్నుస) “ఓరా పరిజనములవలనఁ బొరపడితిని. ఈ చిన్నది యెవరికిఁగాన రాకుండ నాచేఁ గాపాడఁబడుచుండెనో వారికే యిప్పుడు కనఁబడునదియగునే. కావున నిప్పుడిటుచెప్పి దీనిని పంపివేసెదను” అనుకొని (ప్రకాశముగా) పిల్లా సాగరికా! నీవు పరిజనులందరు పరాధీను లైయున్న యీ మదనోత్సవసమయమునందు శారికను ఒంటిగావిడిచి యిక్కడికి వచ్చినావేమి, శీఘ్రముగ నీవక్కడికి పొమ్ము. ఈ పూజాద్రవ్యములనెల్లఁ గాంచనమాల చేత నిమ్ము. అని యారంభించునపుడు సాగరిక, (తనలో) ఆ శారికను నేను సుసంగతచేత నిచ్చివచ్చితిని ఈ వేడుక చూడ వలెనను ఆశయు నాకు మిక్కిలి కలదు. కనుక ఇప్పుడిక్కడనే దాఁగియుండి యీ వేడుకను చూచెదను.” అని నిలుచుటచేత వత్సరాజు సాగరికను చూడకుండుటకై వాసవదత్తచేసిన యుపాయముచేతను శారికను సుసంగతచేతనిచ్చుట మఱుఁగుననుండి వేడుకచూడఁ గోరుట అను కొసములచే సాగరికనిలుచుటచేతను సాగరిక వత్సరాజును పొందుటకు హేతువైనబీజము తోఁచుట వలన ఇది సమాధానమయ్యెను.

## (8) సుఖ దుఃఖ హేతువు విధానము

దేనివలన సుఖదుఃఖములు రెండును గలుగునో దానిఁ దెలుపుట విధానము.

ఉ. వేణీసంహారమునందు.—ద్రౌపది, భీమసేనునితో ‘నాథా మరలవచ్చినవిూచేత నేను ఊరడింపఁబడఁగలదానను. భీముఁడు,

"ఓ పాంచాలరాజతనయా ఇంకను పట్టియూడింపుల చేత నేమి ప్రయోజనము." యుద్ధమునందు ఎల్లకౌరవులను మిగులు లేక చంపక మిక్కిలియైన యవమానము వలని లజ్జచేత యుద్ధము సుఖమునకును దుఃఖమునకును హేతువులగుటవలన ఇది విధాన మయ్యెను.

## (9) అద్భుతావేశము పరిభావన

ఏదేనివింతను జూచుటవలననైన యొడలెఱుఁగమి పరిభావన.

ఉ. రత్నావళియందు — సాగరిక, వాసవదత్తచేయునట్టి పూజలంగీకరించుచున్న వత్సరాజును చూచి ఆశ్చర్యముతో "ప్రత్యక్షముగ మన్మథుఁడే పూజల నంగీకరించుచున్నాఁడు. నేనును ఇక్కడనుండియే పూజించెదను." అనుటచేత వత్సరాజు మన్మథరూపత్వముచే కప్పఁబడుటవలన నైన ప్రత్యక్షము మన్మథుఁడు పూజలను గ్రహించుట యనెడి లోకోత్తరత్వము వలన నాశ్చర్యరసావేశము కలిగెను. గనుక ఇది పరిభావన మయ్యెను.

## 10. గూఢభేదనముద్భేదము

రహస్యమును వెల్లడిచేయుట ఉద్భేదము అనఁబడును.

ఉ. రత్నావళియందు — మన్మథుఁడనెడి వ్యాజముచేతఁ దెలియరాని వత్సరాజుయొక్క వాస్తవస్థితి "సూర్యుఁ డస్తమించుచుండగా . నేనింక నెదురుచూచుచున్నది. (చూ. విలోభ

కము) ఇత్యాదివై లౌకికవాక్యముచేత బీజానుగుణ్యమువలన వెల్లడిచేయఁబడెను. గనుక ఉద్భేదమయ్యెను.

### (11) ప్రకృతారంభము కరణము

బీజమునకుఁ దగిన ప్రకృతకార్యము నారంభించుట కరణము.

ఉ. వేణీసంహారమునందు — భీముఁడు పాంచాలీ! నే మిప్పుడు కౌరవకులక్షయమునకై పోవుచున్నాము అనఁగా, సహదేవుఁడు అన్నా ఇప్పుడు అన్నగారిచేత అనతియ్యఁబడిన పరాక్రమమునకుఁ దగినకార్యముచేయఁ బోవుదము రమ్ము' అనుటచే మీఁదియంకమునందుఁ జెప్పఁబడెడి యుద్ధముయొక్క ప్రారంభము సూచింపబడుటవలన ఇది కరణము.

### (12) ప్రోత్సాహనము భేదము

బీజమునకుఁ దగినట్టు పురికొనఁజేయుట భేదము అనఁబడును.

ఉ. వేణీసంహారమునందు — ద్రౌపది, "నాథా! యుద్ధరంగమునందు నాపరిభవము చేత వెలుఁగుచున్న కోపముగల మీరు శరీరమునం దపేక్ష మాని పరాక్రమింపఁబోయెదరు కుఁడీ. శత్రుబలములు పరాకులేక మెలఁగఁదగినవి యని తెలియవచ్చెడిని." భీముఁడు! ఓ సుక్షత్రియా (దొడ్డరాచవదానా) ఒండొంటితో డీకొనెడియేనుఁగులయొక్క నెత్తురు వస మెదడు నకెడి బురదయందు దిగఁబడిన రథములమీఁద నెక్కి నిలిచి విక్రమించునట్టి కాలిబంట్లును మిక్కుటమై నెత్తురు త్రాగవచ్చి గుంపులుగూడికూసెడి క్రూరములైన నక్కలయూళలనెడి యుద్ధ

వాద్యములచే నటించుచున్న కబంధములును (తల తెగిన మొండెములు నీళ్లు) గల భయంకరమైన యుద్ధభూమి యనెడి సముద్రమునందు తడఁబడక సంచరింప సమర్థులు పాండుపుత్రులు," అనుటచేత కలఁత నొందినమనసుగల ద్రౌపదియొక్క క్రోధోత్సాహబీజము సమతూలత్వముచేత పురికొలుపుటవలన ఇది భేదము.

ఈపండ్రెండు ముఖసంధ్యంగములును బీజారంభసూచకము లగునట్లు సరిగాఁగాని పరంపరాసంబంధముచేతఁగాని గ్రహింపఁదగినవి వీనియందు ఉపక్షేప పరికర పరిన్యాస యుక్త్యుద్భేద సమాధానములు తప్పక గ్రహింపఁదగినవి

3౮. లక్ష్యాలక్ష్యబీజప్రకాశనము ప్రతిముఖము.
స్పష్టముగాఁ దెలియఁదగినదియుఁ దెలియఁదగనిదియు నైన బీజముయొక్క తెలివిడి ప్రతిముఖసంధియగును.

ఇందు ప్రయత్నబిందువులకు సంబంధము.

ఉ. రత్నావళియందు — రెండవయంకమునందు — వత్సరాజుయొక్కయు సాగరికయొక్కయు కూడికకుఁ గారణమైన యనురాగబీజమునకు ప్రథమాంకమునందుఁ జెప్పబడిన, సుసంగతచేతను విదూషకునిచేతను దెలుపఁబడి కొంచెము తెలియవచ్చినదియుఁ వాసవదత్తచేతను చిత్రఫలకచేతను గొంచెము ఊహింపఁబడుచున్నదియునై తెలియఁదగినదియుఁ తెలియఁగానిదియునైన ప్రకాశనము (తెలివిడి) ప్రతిముఖసంధి యయ్యెను. వేణీసంహారము రెండవయంకమునందు: — భీష్ముఁడు

పొందలగువారిని జంపుటచేత ఇంచుక తెలియఁదగినదియు కర్ణాదులకు జంపమిచేత ఇంచుక తెలియఁదగినదియు నైన ప్రథమబీజముయొక్క ప్రకాశనము "పాంచాలకాంద్రలోను చుట్టములలోను బొట్లలోను కొడుకులలోను తమ్ములలోనుకూడ స్వబలముచేతనే యుద్ధమునందు పాండవుఁడు దుర్యోధనుని శీఘ్రముగఁ జంపును. అనుటచేతను, 'దుశ్శాసనుని తొమ్మనందలి నెత్తురుత్రాగుట గదతో దుర్యోధనునితొడలు విఱుగఁగొట్టుట అను వానియందును యుద్ధరంగమునందు సైంధవుని జాపుటయందును తేజస్వులయిన పాండవుల ప్రతిజ్ఞలు తెలియఁదగినవి." అనుటచేతను అగుచున్నది. ఇదియే ప్రతిముఖసంధి యగును.

## 38. బిందుప్రయత్నముల సంబంధమువలన దీనికి విలాసాదు లంగములు పదుమూడు.

బిందువుయొక్కయు, ప్రయత్నము యొక్కయు సంబంధమువలన నీప్రతిముఖసంధికి విలాసము, పరిసర్పము, విధూతము, శమము, నర్మము, నర్మద్యుతి, ప్రగయణము విరోధనము, పర్యుపాసనము, వజ్రము, పుష్పము, ఉపన్యాసము, వర్ణసంహారము, అని పదుమూడు అంగము లగును.

### (1) రత్యర్థమైనయిచ్ఛ విలాసము

కలయికనుగురించిన కోరిక వి[illegible] అనఁబడును.

ఉ. రత్నావళియందు [illegible] స్వార్థా[illegible] [illegible] కొందును తెలిసినకొందు[illegible] ఉద్దీపనమే ఫలముగాఁగల దుర్లభ

అంతట వారి ప్రార్థనానుబంధముచేత నేను ప్రస్థానవము," అని మొదలుపెట్టి, అయినను అరూపమును చిత్తరువునందు వ్రాసి 'సాయిత్ప్రవచ్చినట్టు నేను ప్రవర్తించెదను. అంతకంటె వరుని దర్శనమునకు మరి యేయుపాయమును లేదు' అనుట మొదలాగాగల వానిచేత సాగరికయొక్క పత్నిరాజము గూడదని తగినది యిచ్చు చిత్తరువు మొదలగు వానివలనఁ గలుగునదిగా నుద్దేశించి చేయఁబడ్డ అనురాగబీజమునకు అనుకూలమైన చేష్టారూప ప్రయత్నమిట్టు నిరూపణము.

## (2) దృష్ట నష్టానుసర్పణము పరిసర్పము

తోఁచితోఁచబీజమును అనుసరించుట పరిసర్పము అనఁ బడును.

ఉ. వేణీసంహారమునందు — కంచుకి తనలో "ఇతఁడు బలవంతులు అనఁగా కృష్ణునితోడు పాటుచేత బలవంతులయిన పాండవులు దండెత్తివచ్చి పోరుచున్న యీ సమయమునందుఁగూడ అంతఃపురసుఖము ననుభవించుచున్నాఁడు. రాజయినవానికి ఇదియు నొక్క తక్కువే. ఆయుధముచేతఁ బట్టినది మొదలు పెద్దలకు లోఁగాకున్నవాఁడును పరశురామునిఁ గూడ జయించినవాఁడునైన మహాకాయుఁడు భీష్ముఁడు పాండవులవలన యుద్ధమునందుఁ బడిపోయినను చింతలేనివానిమైనను [illegible], అనేకులు సమర్థులైన విలుకాండ్రు, ఒక్కరై అంతకు ముందు ఎంతో పేరు యుద్ధము చేసి యలసియున్న కొలుని అభిమన్యుని జంపినవారికి సంతోషించుచున్నాఁడు." అనుటచేత

భీష్మాదుల చావువలన దృష్టమును అభిమన్యుని చావువలన నష్టము నైన కృష్ణుని తోడుపాటుచేత బలవంతులయిన పాండవుల యుద్ధ లక్షణమందు బీజ ప్రయత్నముల సంబంధముచేత కొంచెము వలన బీజమునుసరించునయ్యెను. కనుక ఇది పరిసర్పము. రత్నావళి యందు—సాగరిక మాటచేతను చిత్తరువును జూచుటచేతను దృష్టనష్టమై సాగరికానురాగబీజముయొక్క యనుసరణము 'అదియెక్కడ, అదియెక్కడ, అని వత్సరాజుచే వెదకుట వలన పరిసర్పము.

## (3) అరతివిధూతము

విషయములయందు ఇచ్ఛలేమి విధూతము అనఁబడును.

ఉ. రత్నావళియందు—సాగరిక, 'ఓచెలీ నన్ను సంతాపము మిక్కిలి బాధపెట్టుచున్నది. అనఁగా సుసంగత' సరస్సునందుండి తామరతేకులను తామరతూండ్లను తెచ్చి దాని దేహమున నుంచుచున్నది. సాగరిక, వానిని తొలఁగఁద్రోసి, 'చెలీ, యేల యూరక నన్ను ఆయాసపెట్టెదవు. దీనిని తొలఁగఁ దీయుము చెప్పెదం దుర్లభులమీఁది అనురాగము. మిక్కిలిదొడ్డది సిగ్గు పరవశము మనస్సు సరికానిది ప్రేమము కనుక నాకు మరణమొకటియే శరణము." అనుటచేత సాగరికానురాగబీజాన్వయముచే శీతోపచారములవలని యిచ్ఛ లేదయ్యెను. కనుక విధూతము.

వేణీసంహారమునందు — భానుమతికి దుస్స్వప్నదర్శనముచే దుర్యోధనునికి కీడుకలుగునోయను శంకచేతఁగాని పాండవులకు జయముగలుగునోయను శంకచేతఁగాని అరతియగుటవలన విధూతము.

### (4) అరత్యుపశమము శమము

మీఁదఁ జెప్పినయరతి మానుట శమము అనఁబడును.

ఉ. రత్నావళియందు—రాజు విదూషకునితో "మిత్రుఁడా! నేను దానిచేతఁ జిత్తరువునందు వ్రాయఁబడితినట నాయెడ నాకే అదియొకబహుమానముగ నున్నది. నేనెట్లు చూడకుందును." అని యుపక్రమించునపుడు సాగరిక (తనలో) 'మనస్సా ఊఱడుము ఊఱడుము నీకోరిక యింతటి స్థితికి రాలేదా" అనుట చేత ఊఱడుము అనెడి యరత్యుపశమమువలన ఇది శమము.

### (5) పరిహాసవచనము నర్మము

ఎగతాళిమాటగలచోట నర్మము అని అర్థము

ఉ. రత్నావళియందు-సుసంగత — దేనికై కోరికతో నీవు వచ్చితివో అది నీ యెదుటనే యున్నది." అనఁగా, సాగరిక — అసూయతో సుసంగతా; దేనికై నేను వచ్చితిని ఓసీ తన్ను నమ్మక శంకించెడిదానా చిత్తరువు పలకకై దానిని దీసికొనుము" అనుటచేత భీతాన్వితమయిన యెగతాళిమాటయగుటవలన ఇది నర్మము. వేణీసంహారమునందు—దుర్యోధనుఁడు పనికత్తెచేతి నుండి పూజాపాత్రమును దీసికొని భార్యకిచ్చెను భానుమతి అర్ఘ్యమిచ్చి మరల, ఓసీ పువ్వులన్ని తెమ్ము. తక్కినదేవతలను పూజజరపెదను.' అని చేయి చాఁచుచున్నది దుర్యోధనుఁడు పువ్వుల నందిచ్చుచున్నాఁడు అతనిసోఁకుడువలనఁ బుట్టిన పులకలుగల భానుమతిచేతిలోనుండి పువ్వులు రాలుచున్నవి. దీని చేత చెడ్డకలగన్న దోషము మానుటకై భానుమతిచేయుచున్న

దేవతాప్రాణమ విఘ్నముకలుగఁ జేయునట్టి పరితాపముచేత దీని ప్రకాశన మగుటవలన పరిహాసమునకుఁ బ్రతిముఖాంగత్వము యుక్తము.

(౯) నర్మమువలన నైన ధృతి నర్మద్యుతి

ఆనర్మమువలనఁ గలిగిన సంతోషము నర్మద్యుతి యనఁబడును.

ఉ. రత్నావళియందు — సుసంగత. 'సఖీ! యిప్పుడు నీవు మిక్కిలి గడుసుదానవై తివి ఇట్లు చెలిమికి చేత చేయఁబట్టుకొన బడినదానవయ్యెను కోపము విడువవు." సాగరిక, కోపము ఓహో ఇంచుకయిన్నా సుసంగతా ఇప్పుడును నీవు ఊరకుండవుగా" అనుటచేత అనురాగ బీజమును దాలిపెడి సంబంధము వలని సంతోషము పరిహాసమువలనఁ గలిగెను. కనుక ఇది నర్మద్యుతి.

( ) ఉత్తరావాక్యప్రగయణము

మీఁదిమీఁది మాటలచేత అనురాగబీజమును వెల్లడిచేయునది ప్రగయణము అనఁబడును.

ఉ. రత్నావళియందు — విదూషకుఁడు, రాజుతో "మిత్రుఁడా సంతోషముగా వర్ధిల్లెదవు" అనఁగా రాజు మేము కతో చెలికాఁడా! ఇదియెట్లు, విదూషకుఁడు "నేను చెప్పునది యేదో అది. నీవె వ్రాయబడితివి. మతియొకఁడు మన్మథవ్యాజముచేత మాటలాడఁబడును.' అనునది మొదలగువానిచేతను, "ఓప్రియనాళసారమా నీవు దానికవచకలశములనదుకుచుండి జారి పడి వాడిపోతివా యేమి అతిచకలశముల నదుమ నీరైన నన్ను వు దారముకుఁ గూడ ఎడము కానరాదే నీకెట్లు ఎడము కలుగును."

అనునిది మొదలగువానిచేతను రాజు విదూషకుఁడు సాగరిక సుసం గత వీరియొక్క పరస్పరవచనములచేతను మీఁదమీఁద నమరాగ బీజము వెల్లడియగుటవలన ఇది ప్రకయణమయ్యెను.

(౩) హితరోధము నిరోధము

మేలురాకకైన యడ్డంకి నిరోధము అనఁబడును.

ఉ. రత్నావళియందు —రాజు విదూషకుని జూచి "ఓ మూర్ఖుఁడా దైవబలముచేత ఎట్లో నాచేతికిఁజిక్కిన ప్రకాశ మయిన యనురాగముగల ప్రియురాలు రత్నావళివలెఁ గంఠము నందుఁ జేర్పఁబడక చేజారిపోవునట్లు చేసితివి" అనుటచేత వత్స రాజుయొక్క సాగరికాసమాగమరూపమయిన మేలురాకను వాసవదత్త రాకను జెలుపునట్టి విదూషకునిమాటచేత అడ్డంకి యయ్యెను. కనుక ఇది నిరోధము.

(౪) అనునయము పర్యుపాసనము

ప్రియజనులయూరార్పు పర్యుపాసనము అనఁబడును.

ఉ. రత్నావళియందు —రాజు మిక్కిలి ప్రియముగల యోప్రాణనాయకీ నాయందు దయచేయుము మందునన్ను కోపము లేని నీయెడ నది పొసఁగదు. ఇఁక నేనిట్లు చేయను" అను నెడ ఇంతకుముందొక తప్పుచేసినట్లేర్పడును. నాయందుఁ దప్పులేదందునేని నీవు నమ్మవు. కనుక ఇప్పుడు ఎట్లుచెప్పుట మరియో నాకుఁ దోఁచినదికాదు." అనుటచేత చిత్రరువునందు వ్రాయఁబడిన నాయికానాయకులను జూచి కోపించిన వాసవ దత్తయొక్క అనునయము (ఊరార్పు) నాయకుల యనురాగ మును ఉగ్గడించుటవలన ఇది పర్యుపాసనము.

## (10) విశేషవద్వాక్యము పుష్పము

అనురాగమును గనఁబఱిచెడి ప్రియులయొక్క యతిశయపు మాట పుష్పము అనఁబడును.

ఉ. రత్నావళియందు —రాజు సాగరిక చేయి పట్టుకొని స్పర్శసుఖమును నటించుచున్నాఁడు. విదూషకుఁడు ఓయీ! నీవు ఈమెచేత నూతనశ్రీ పొందఁబడుచున్నది రాజు మిత్రుఁడా నిజముగా ఇది శ్రీయే. దీనిచేతులు పారిజాతపుఁ జిగుళ్ళు. కాని పక్షమున చెమటయును కొనుముచేత ఇందు అమృతరసము ఎట్లు స్రవించును" అనుటచేత నాయికా నాయకులకు ప్రత్యక్షదర్శనము మొదలగువానిచేత విశేషమయిన యనురాగ మంగ్గడింపఁబడుటవలన ఇది పుష్పము.

## (11) ఉపాయముతోడి వాక్యరచన యుపన్యాసము

అనురాగహేతువైన యుపాయములోఁగూడిన మాటల కూర్పు ఉపన్యాసము అనఁబడును

ఉ. రత్నావళియందు —సుసంగత రాజుతో ఏలినవారికి ఈశంక పనిలేదు. దేవరవారి యనుగ్రహబలముచేత నేనును అట్లాడితిని కనుక ఈకష్టముచేనేమి ఇట్టిప్రీతియే దొడ్డయనుగ్రహము. నాప్రియసఖి సాగరిక నన్నేల చిత్తరువునందు వ్రాసితివి' అని నామీఁదఁ గోపము చేయుచున్నది. ఆకోపమును తీర్తురుగాక" అనుటచేత సుసంగతవలన నాచే సాగరిక వ్రాయఁబడినది. సాగరికతోడ నీవును వ్రాయఁబడితివి. అను-

టను దెలిపెడి ఉపాయములోఁడి ప్రియ వాక్యోపన్యాసముచేత అనురాగబీజమును దోఁపించుటవలన ఇది యుపన్యాసము

**(12) ప్రత్యక్షనిష్ఠురము వజ్రము**

ఎదుటనాడెడి నిష్ఠురపుమాట వజ్రము అనఁబడును.

ఉ. రత్నావళియందు—వాసవదత్త రాజానకుఁ జిత్రరుపు పలకను జూచి, 'ఆర్యపుత్ర యీపడుచు దీనియందు నీవెంబడి వ్రాయఁబడుటకూడ వసంతకుని విజ్ఞానమా. (విజ్ఞానము = శిల్పపుఁబనుల యందలి నేర్పు) ఈచిత్రకర్మమును జూచుటచే నాకును దలనొప్పి కలిగినది" అనుటచేత వత్సరాజునకు సాగరిక యందు అనురాగముకలుగుట దెలిసి వాసవదత్తయెదుట నిష్ఠురపుమాటలాడుట చేటుపడుచున్నది కనుక వజ్రము.

**(13) చాతుర్వర్ణ్యోపగమనము వర్ణసంహారము**

బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులనెడి నాలుగు వర్ణములవారి చేరికను దెలుపుట వర్ణసంహారము అనఁబడును

ఉ. వీరచరితము తృతీయాంకమునందు -- దశరథుని మంత్రులు మొదలగువారు పరశురామునితో ఇదిఋషుల గోష్ఠి ఇతఁడు వృద్ధుఁడైన యుధాజిత్తు ఇతఁడు రాజులతోను మంత్రులతోను గూడినవృద్ధుఁడగు లోమపాదమహారాజు, ఇతఁడు ఎడతెగని యజ్ఞములుగల వాఁడును బ్రహ్మవాదియుం బహుదినములవాటివాఁడు నైన జనకమహారాజు పీడింపఁబడను మిమ్ము వేఁడుకొనువారు. కీడుచేయకుఁడు." అనుటచేత రాముని గెలుపును కోరుచున్నఋషులు రాజులు మంత్రులు మొదలగు

వారు చేరుటచేత పరశురాముని యన్యాయమును నీవు చేయకుండుటను గోరునట్టి మార్గమును దెలుపుటవలన ఇది వర్ణసంహారము.

ఈ చెప్పఁబడిన పదుమూడును ప్రతిముఖసంధియొక్క అంగములు. ఇది ముఖసంధియందుఁ దెలుపఁబడిన బిందులక్షణములయిన అవాంతరబీజమహాబీజప్రయత్నములను అనుసరించి చెప్పఁబడినవి. వీనిలోఁ గల పరిసర్పము, ప్రశమనము, వజ్రము, ఉపన్యాసము, పుష్పము. అనునవి యైదు ముఖ్యములు. ఇతరములు ప్రకరణమునకుఁ దగినట్లు ప్రయోగింపఁదగినవి.

## 3౬. మాటిమాటికిఁ జేయఁబడు దృష్టనష్ట బీజాన్వేషణము గర్భము.

కనఁబడునదియు, కనఁబడనిదియు నైన బీజమును మాటి మాటికి వెదకుట గర్భసంధి అనఁబడును.—అనగా ప్రతిముఖ సంధియందు కనఁబడినదియుఁ గనఁబడనిదియునగు విధముచేత కొంచెము సూచింపఁబడిన బీజమును స్పష్టముగాఁ దెలిపెడి విఘ్నముతోఁ గూడిన ప్రయోజనముయొక్క (ఒకప్పుడు ఎడఁబడి మరలఁ బొందుపడుటయు మరల చెడఁబడుటయు తిరుగానది వెదకఁబడుటయు తడవతడవకు నిర్ధారణచేయఁబడుటయుఁ గల రహస్యప్రయోజనముయొక్క) ప్రాప్త్యాశ గర్భసంధి అనఁబడునని యర్థము. అందును స్వభావముచేత పొందఁబడిన పతాకకు నియమములేమి (ఇది పతాక అవునా కాదా అనుట) కానఁబడుచున్నదయ్యు దీనిచేత ప్రాప్తిసంభవము కానేయవునుట

తెలియఁబడుచున్నది. (ఇందు ప్రాప్త్యాశాపతాకలకు సంబంధము.)

ఉ. రత్నావళి మూడవయంకమునందు:— వత్సరాజునకు వాసవదత్తారూపమునున యుపాయముచేతను దానివేషము వేసికొనిన సాగరిక రహస్యముగా వచ్చిచేరుట యనెడి యుపాయముచేతను విదూషకునిమాటవలన తొలుత సాగరికా ప్రాప్త్యాశయు, పిమ్మట వాసవదత్తవలన ఎడఁబాటును మరలఁ బొందుపాటును తిరుగా ఎడఁబాటును అటుపిమ్మట అపాయనివారణోపాయమును వెదకుటయు రాణిని దేర్చుట తక్క వేఱొక యుపాయమేదియుఁ గలుగదని నిశ్చయించుటయుఁ దెలియఁజేయఁబడుటవలన గర్భసంధి యయ్యెను

32. ప్రాప్త్యాశాపతాకల సంబంధమువలన దీనికంగముల భూతాహరణాదులు పండ్రెండగు.

ప్రాప్త్యాశయొక్కయు పతాకయొక్కయు సంబంధమువలన నీగర్భసంధికి అభూతాహరణము, మార్గము రూపము ఉదాహరణము, క్రమము, సంగ్రహము, అనుమానము, తోటకము, అధిబలము, ఉద్వేగము, సంభ్రమము, ఆక్షేపము అని పండ్రెండు అంగములు అగును.

(1) ఛద్మము భూతాహరణము

(ఛద్మము = వంచన, మోసము.)

ఉ. రత్నావళియందు:— ఓరీ అమాత్యా వసంతక మేలు మేలు ఈసంధివిగ్రహ చింతచేత మంత్రియయిన యౌగంధ

రాయణుని మించిరిని." అను చోట ప్రవేశకమునందు వాసవ
దత్త వేషము వేసికొనిన సాగరిక వత్సరాజును గూర్చి పోవుట
ఛద్మము ఇది విదూషకునిచేతను సుసంగతచేతను ఒనఁగూర్చఁబడి
కాంచనమాలాను వాదమూలమున వెల్లడిచేయఁబడెను. కనుక
అభూతాహరణము (అనువాదము = ఒకరు చెప్పినదానిని వారు
చెప్పినట్టె చెప్పుట.)

### — (2) తత్త్వార్థకీర్తనము మార్గము —

స్వభావసిద్ధమయినవిషయమును వివరించి చెప్పుట మార్గము.

ఉ. రత్నావళియందు — విదూషకుఁడు, కోరికకుమించిన
కార్యసిద్ధిచేత సంతోషముతో వర్ధిల్లెదవు. రాజు మిత్రమా
ప్రియురాలికి కుశలమా. విదూషకుఁడు ఇప్పుడే నీవు చూచి
తెలిసికొనెదవు. రాజు చూపుగూడ కలుగునా. విదూషకుఁడు
గర్వముతో "బుద్ధివైభవమునందు బృహస్పతిని మించిన మంత్రి
నేనుండగా ఎట్లుకలుగకపోవును! రాజు అట్లయినను దినెట్లో
వినఁగోరెదను విదూషకుఁడు" ఇట్లు అని, రాజు చెవిలోఁ జెప్పెను
దీనిచేత విదూషకుఁడు సాగరికరాకను బట్టి రెట్లు జరిగెనో అట్లు
నిశ్చయమైన సంగతిని రాజుతోఁ జెప్పెనకడి తత్త్వార్థకథ
నము వలన ఇదిమార్గము.

### — (3) వితర్క్యవద్వాక్యము రూపము —

వితర్కముతోఁగూడిన మాట రూపము అనఁబడును.
(వితర్కము = ఇది యిట్లుండునా అనెడి యూహ.)

ఉ. రత్నావళియందు — రాజు డొరా తన యిల్లాలిరాకను గూఢ లక్ష్యయము చేయని నూతన అనముపలని కాముకజనము యొక్క పక్షపాతము. కామిని (కామముగల సూఁదుది) సంకేతమునందు జంకుపలక ప్రేమముతోడి చూపుఁ జూడ నేరదు. మెండగు కౌఁగిలించుకొనునపుడు సంతోషముతో స్తనములను ఘనముగాఁ జేర్పదు. ప్రయత్నముచేత నిలుపఁ బడియును మాటిమాటికిఁ బోయెదను" అని చెప్పుచుండును. అయినను అది మిక్కిలి రమింపఁ జేయుచున్నది, వసంతకుఁడు 'ఏల తడసెదు ఈ వృత్తాంతము రాణికిఁ దెలిసెనా యేమి' అనుట చేత రత్నావళియొక్క రాకకుఁ దగునట్లే రాణివలని శంకయుఁ ఊహింపఁబడుటవలన ఇది రూపము.

## — ఉత్కర్షతోడి వాక్య ముదాహరణము —

ఆధిక్యముతోఁ (మేలిమితో) గూడినమాట ఉదాహరణము.

ఉ. రత్నావళియందు — విదూషకుఁడు సంతోషము ఓయా నాచెలికానికి కౌశాంబీరాజ్యలాభముచేత నయితము నావలని ప్రియవచనమును విని పొందినంత సంతోషము కలిగియుండదు అని యూహించెదను' అనుటచేత రాజునకు రత్నావళీప్రాప్తి వృత్తాంతము కౌశాంబీరాజ్య లాభముకంటె హెచ్చయ్యెననెడి యుత్కర్షమును దెలిపెడి మాటవలన ఇది యుదాహరణము.

## — సంచిన్త్యమానాప్తి క్రమము —

(సంచింత్యమానము = చక్కఁగాఁ దలఁపఁబడుచున్నది ఆప్తి = ప్రాప్తి) తాను దలఁచుచున్న వస్తువు తనంతట వచ్చి పొందుట క్రమము అనఁబడును.

ఉ. రత్నావళియందు.—రాజు ప్రియురాలిరాక యనెడి వేడుక వాపించినది. ఇప్పుడుగూడ నామనస్సు మిక్కిలి తత్తరించుచున్నదేమి. తీక్ష్ణమయిన మన్మథసంతాపము మొదటను గూడ ఇంత బాధించినది కాదు. ఫలాగమము సమీపించినప్పుడు మిక్కిలి బాధించుచున్నది. వాన రాఁగలదినము మిక్కిలి దగ్గర వచ్చినప్పుడు వానకాలము మిక్కిలి తాపమును బొందించుచున్నదిగదా" అనగా విదూషకుఁడు విని సాగరికా మన యనుఁగుఁ జెలికాడు నిన్నుగుఱించి యీ యత్యంతమైన తహతహను దెలుపుచున్నాఁడు. కనుక నీవు వచ్చుటను ఆయనకుఁ దెలిపెదను' అనుటచేత సాగరికరాకను గోరుచున్న వత్సరాజునకు భ్రాంత సాగరికాప్రాప్తి (సాగరికవేషము వేసికొన్న వాసవదత్తపొందు) అగుటవలన ఇది క్రమము.

### (*) భావజ్ఞానము క్రమము

(అని కొందఱు)

అభిప్రాయముయొక్క తెలివిడి క్రమము అని కొందఱు చెప్పుదురు. (తెలివిడి = తెలియఁజేయుట).

ఉ. రత్నావళియందు —రాజు సమీపించి (దగ్గఱవచ్చి) ప్రియురాలవైన యో సాగరికా నీ ముఖము చందమామ. కన్నులు-కలువలు. చేతులు కమలములనుబోలినవి. తొడలజంట అరఁటులనుబోలినది. ఇట్టిసంతోషమును గలిగించెడి యెల్ల యంగములుగల నీవు జంకుమాని సంతోషముతో నన్ను గౌఁగిలించుకొని, మన్మథతాపముచేత వికలములయిన నా యంగములను సుఖింపఁజేయుము." అను వాక్యముచేతను, ఇక్కడ

అదియుం బింబాధరమునందున్నది, అనునది మొదలుగాంగల వాక్యముచేతను వత్సరాజుయొక్క యభిప్రాయము వాసవదత్తకుఁ దెలియబడుటవలన ఇది మతియొక్క క్రమము.

(6) సామదానోక్తి సంగ్రహము

సామము = మంచితనము, దానము = ఏదేనియుం నిచ్చుట, ఈ రెంటితోను గూడినమాట సామదానోక్తి, అది సంగ్రహము అనఁబడునని యర్థము.

ఉ రత్నావళియందు — రాజు, 'చెలికాఁడా మేలు మేలు నీకు ఇదిగో ఈ కడియమును బారితోషికముగా నిచ్చెదను" అను నీసామదానములతోఁ గూడిన మాటలచేత సాగరికయొక్క కూడికను గలుగఁ జేసిన విదూషకుని సంగ్రహించుటవలన ఇది సంగ్రహము.

(7) లింగతోభ్యూహనమనుమానము

(లింగతః = హేతువువలన, అభ్యూహనము = ఊహించుట) హేతువులనుబట్టి విషయము నూహించుట అనుమానము అనఁబడును.

ఉ. రత్నావళియందు — రాజు 'ఛీ మూర్ఖుఁడ నాకు కలిగిన యీ యనర్థము నీచేతనైనది. ఎట్లు అనఁగా, ప్రణయ గౌరవమువలన నానాట దృఢపడిన ప్రీతిగల యీ ప్రియురాలు ముందెన్నఁడును జేసియుండఁగని నాయీయప్రియమును సహింపక జీవమును విడువనున్నది. మిక్కుటమైన ప్రేమతోలఁగుట సహింపరానిదే యగునుగదా" విదూషకుఁడు "మిత్రుఁడా

వాసవదత్త యేమిచేయుచున్నదో యెఱుఁగను సాగరిక యెంతఁ గలదు" అనుటమాత్రమని తలఁచెదను. ఇందు సాగరికయందలి యనురాగమువలనఁ బుట్టిన అధికమగు ప్రేమము తొలఁగుట చేత వాసవదత్తయొక్క మరణమును ఊహించుటవలన యను మానము.

### (8) అభిసంధి యధిబలము

(అభిసంధి = ఇష్టజనులవలని వంచన) అన్యోన్యసాంగత్యము కలిగినప్పుడు ఇష్టజనులవలనఁ జేయఁబడెడి వంచన అధిబలము.

ఉ.రత్నావళియందు:—కాంచనమాల 'ఓరాణీ ఇది అచిత్ర శాల కనుక వసంతకునికి సంజ్ఞ చేసెదను." అని చిటికవేసెను. దీనిచేత సాగరికారాజసంగతుల వేషములు వేసికొన్న వాసవదత్తా కాంచనమాలలచేత రాజవిదూషకులయొక్క వంచన ఇందుఁ జేయఁబడెను కనుక ఇది అధిబలము.

### (9) సంరబ్ధవచనము తోటకము

వేగిరపాటుతోడి మాట తోటకము అనఁబడును.

ఉ. రత్నావళియందు:—వాసవదత్త రాజును సమీపించి ఆర్యపుత్ర ఇదియుక్తము: ఇది సరి. అని తరువాత కోపముతో ఆర్యపుత్ర లెమ్ము లెమ్ము ఇదియేమి ఇప్పుడుగూడ అభిజాత్యము కలిగి సేవాదుఃఖమును అనుభవించెదరు" అని కాంచనమాలా, 'చిత్రు ఈ పెద్దబ్రాహ్మణుని ఈ త్రాటిచేతనే కట్టి తీసికొనిరా, ఈ చెడ్డపడుచునుగూడఁ దీసుకవచ్చి యెదుటనిలుపుము.' అనుట చేత సాగరియొక్క కూడికను విఘ్నకారిణియగు వాసవదత్త

యొక్క వేఱపాటుతోడి మాటయనెడి అనిశ్చితప్రాప్తికారణము తోటకము అని చెప్పఁబడెను. వేణీసంహారమునందు 'రాత్రి యంతయు సుఖముగా నిద్రించి యిప్పుడు స్తోత్రముచేత ప్రయత్నపూర్వకముగా మేలుకొలుపఁబడితిరి, అనునది మొదలు నేను ఎంతపర్యంతము ఆయుధములకు పూనియుందునో అంత పర్యంతము ఇతరుల యాయుధములతో నేమి ప్రయోజనము' అనునది తుదగాఁగల సేనకుఁ గలఁతను బుట్టించెడి కర్ణాశ్వత్థామల వేఱపాటుతోడి పరస్పరవాక్యములచేత పాండవులయొక్క గెలుపుగలుగుననెడి యాశతోఁ గూడిన తోటకమయ్యెను.

## (౫) తోటకము నన్యథాభావ మధిబలము

(అని కొందఱు)

తోటకముయొక్క మాఱుపాటు అధిబలమని కొందఱు చెప్పుదురు అని యర్థము.

ఉ. రత్నావళియందు —రాజు 'ఓరాణీ! నాయపరాధము ఇట్టు ప్రత్యక్షముగాఁ జూడఁబడెను. ఇఁక నేమి విన్నవింతును. అని సిగ్గుపడ్డవాఁడనై నేను వాతలతో లత్తుకపూఁతచేతనైన నీయడుగుల యెఱ్ఱఁదనమును బోఁగొట్టుదును. కోపమనెడి గ్రహణమువలననైన నీముఖచంద్రబింబముయొక్క యెఱ్ఱఁదనము పోయన్న నాయందు నీకుగల మిక్కుటమయిన దయను పోఁగొట్టఁజాలినది.' అనుటచేత ఇందు వేఱుపాటుతోడి మాటలుగల వాసవదత్త కోపము చాల్పుటకు వేఱుమార్గములేక వత్సరాజు నైచ్యమును చూపుట వలన ఇది తోటకమునకు అన్యథాభావము

(౯) సంరబ్ధవచనము గలది యేదో అది తోటకము (అని కొందఱు)

ఉ. రత్నావళియందు:—రాజు 'ప్రియురాలా వాసవదత్తా ప్రసన్నురాలవగుము ప్రసన్నురాలవగుము' వాసవదత్త కన్నుల నీళ్లు పెట్టుకొని 'ఆర్యపుత్ర ఇట్లు చెప్పకుడు ఈ యక్షరములు అన్యను బొందినవి కావా" ఇందు ఇఱువురయందును సంరబ్ధ వచనములు గానవచ్చెడిని. వేణీసంహారమునందు—రాజు 'ఓరి సుందరక అంగరాజునకుఁ గుశలమా' సుందరకుడు శరీర మాత్రమునఁ గుశలము. రాజు అతని కేమి అర్జునుని చేత గుఱ్ఱములు చంపఁబడెనా సారథి తెగెనా రథము భగ్నమయ్యెనా' సుందరకుడు, రథము భగ్నము కాలేదు. మనోరథమే భగ్నమయ్యెను. (భగ్నము=చెడినది, మనోరథము=కోరిక) ఇందు ఇవి మొదలగు సంరబ్ధ వచనములు కలుగుటచేత ఇది తోటకము.

(10) శత్రుకృతమైన భీతి యుద్వేగము

మగవారివలన నగుభయము ఉద్వేగము అనఁబడును.

ఉ. రత్నావళియందు —సాగరిక (తనలో) "అదృష్టహీనురాలను దయయిచ్చుచొప్పునఁ జచ్చుటకుఁ గూడ స్వతంత్రతలేదు." దీని చేత వాసవదత్తవలన సాగరికకు భయము అయ్యెను గనుక ఉద్వేగము. (ఏది దేనికి అపకారము చేయునో అది దానికి శత్రువు గనుక సాగరికకు వాసవదత్త శత్రువుగా నిట గ్రహింపఁబడెను.) వేణీసంహారమునందు—సారథి విని భయముతో 'ఈ కౌరవ రాజ పుత్రులనెడి మహావనమునకు కీడు కలుగఁ జేసెడి గాలియైన గాలికొడుకు (భీమసేనుఁడు) సమీపించెను. రాజా కలత్ప

జడిసియున్నారు. కనుక రథమును దూరముగాఁ దొలఁగించుకొని పోయెదను. ఈ దుష్టుఁడు ఒకవేళ దుశ్శాసనునివలె ఇతనికిఁ గూడఁ కీడు చేసినను చేయఁగలఁడు.' అనుటచేత శత్రువుచేఁ జేయఁబడిన భీతి తోఁచుచున్నది, కనుక ఉద్వేగము.

## (11) శంకాత్రాసములు సంభ్రమము

సందేహమును భయమును సంభ్రమము అనంబడు.

ఉ. రత్నావళియందు —విదూషకుఁడు చూచుచునే ఈమె యెవరు, అని సంభ్రమములో రాణియైన వాసవదత్తయే కన్నుఁ గానే చంపుకొనునా రాజా కత్తులముతో దగ్గఱ వచ్చి అది యొక్కటి అనుటచేత వాసవదత్త యని గ్రహింపఁబడిన సాగరిక యొక్క మరణము సందేహము కనుక ఇది సంభ్రమము ..వేణీ సంహారమునందు—అశ్వత్థామ సేనాన్యమునందలి కలకలధ్వని విని, కత్తులపాటులో కుమార కష్టము కష్టము. తోడఁబుట్టినవాని ప్రతిజ్ఞకు భంగమువచ్చునో యని భయపడెడి యీ యర్జునుఁడు బాణములవానతోఁ కర్ణదుర్యోధనుల నెదురుకొని పోవుచున్నాఁడు. సర్వవిధములను దుశ్శాసనుని నెత్తురు భీమునిచేత త్రాగఁబడెనే.' అనుటచేత శంక, సారథి దెబ్బలతోనే ప్రవేశించి కత్తులపడుచు 'బిడ్డఁడు రక్షింపుఁగాక రక్షింపుఁగాక అనుటచేత త్రాసము ఈ శంకాత్రాసములచేత దుశ్శాసన ద్రోణుల చావులను సూచించుటవలన ఇది పాండవుల విజయప్రాప్త్యాశతోఁ గూడిన సంభ్రమము.

## (12) గర్భబీజసముద్భేదయాక్షేపము

గర్భబీజమును వివరించుట యాక్షేపము అనఁబడును.

ఉ. రత్నావళియందు.— రాజు 'చెలికాఁడా రాణిని దెచ్చుట దక్కదక్కన యుపాయమేదియును గానరాదు. మఱియొక చోట రాణిని దెచ్చుటను గూర్చి యెల్లవిధముల చేతను మనము ప్రత్యాశలేనివారముగుచున్నాము. ఇఁక నిక్కడనుండి ప్రయోజన మేమి రాణినిగూర్చి పోయియే తేర్పుదము.' అనుటచే రాణి యనుగ్రహమునకు లోఁబడినదైన సాగరికరాక సిద్ధించుట. ఆ రాణియనుగ్రహమువలననే కావలెనను గర్భబీజమును వివరించుటవలన ఇది యాక్షేపము. వేణీసంహారమునందు— సుందరకుఁడు అట్టు కానియెడ దేవుని నుపాలంభింపనేల తిరస్కరింపఁబడిన విదురుని మాటయనెడి విత్తనమును, అవమానింపఁబడిన తాతమాటయనెడి మొలకయుం శకునియొక్క ప్రోత్సాహమనెడి నాటుకొన్న వేరును, ద్రౌపది కొప్పుపట్టి యీడ్చుటయనెడి పువ్వులునుగలతూట (కపట) విషవృక్షముయొక్క పండుపండినది. దీనిచేత బీజమే ఫలోన్ముఖత్వమున నాక్షేపింపఁబడెను కనుక ఇది యాక్షేపము. (ఉన్ముఖత్వము = అభిముఖమగుట ఆక్షేపింపఁబడుట = ఆకర్షింపఁబడుట)

ఈచెప్పఁబడిన గర్భసంధ్యంగములు పండ్రెండును ప్రాప్త్యాశను గనఁబరచుటచేతఁ జెప్పఁబడెను. వీనిలో అభూతాహరణము మార్గము తోటకము అధిబలము, ఆక్షేపము అనునవి ముఖ్యములు. తక్కినవి యథోచితముగా గ్రహింపఁదగినవి.

## 32. క్రోధ వ్యసన విలోభనములయందేదే నొక దానివలననగు గర్భనిర్భిన్న బీజార్థ విమర్శన మవమర్శసంధియగు.

(విమర్శనము = అవమర్శము = చక్కఁగా విచారణచేయుట, నిర్భిన్నము = విశదముగాఁ దెలుపఁబడునది, బీజార్థము = బీజ ప్రయోజనము.) క్రోధముచేతనేని వ్యసనముచేతనేని విలోభమైన వంచనచేతనేని యగు గర్భసంధియందుఁ దెలుపఁబడిన బీజ ప్రయోజనము అనఁగా ఇది దీనిచేతనే అయ్యెనని నిర్ధారణ చేయఁబడిన యేకాంతఫలప్రాప్తి నిశ్చయముగల గర్భసంధియందుఁ జెప్పఁబడిన బీజార్థసంబంధవిమర్శనము అవమర్శసంధియగును. (ఇందు నియతాప్తిప్రకరికలకు సంబంధము.)

రత్నావళి నాల్గవయంకమునందు:—అగ్నివిద్రవ (అగ్ని భయముచే జనులు పాఱిపోవుట) పర్యంతమైన వాసవదత్త ప్రసక్తిచేత అపాయములేని రత్నావళీప్రాప్తి నిశ్చయరూప విమర్శము చూపఁబడెను. వేణీసంహారమునందు—దుర్యోధనుని పట్టుటతోఁగూడిన భీమసేనుని రాకవరకు నైన కథయందు యుధిష్ఠిరుఁడు, భీష్ముఁడనెడి సముద్రము దాఁటఁబడెను. ఎట్టో ద్రోణాచార్యులనెడి యగ్నియు నణఁగెను. కర్ణుఁడనెడి విష సర్పమును అణఁగఁగొట్టబడెను. శల్యుఁడు స్వర్గమునకుఁ జనియెను. ఇఁక కొంచెము మిగులుగల యీ గెలుపునందు సాహసప్రియుఁ డయిన భీమసేనుని యాటోపముతోడి యీ మాటచేత మన మందఱమును జీవితసంశయమయిన స్థితియందు నిలుపఁబడితి మ

నందు—యుధిష్ఠిరుఁడు ‘పాంచాలకా దుష్టుఁడైన యాకౌరవాపశదుని దారి కనిపెట్టఁబడెనా. పాంచాలకుఁడు కేవలము శ్రోవమాత్రముకాఁడు. ద్రౌపదిజడను ముట్టుట యను పాపమునకుఁ బ్రధానకారణమైన యాదురాత్ముఁడును చిక్కెను. అనుటచేత దుర్యోధనుని తప్పు వెల్లడిచేయఁబడెను. కనుక ఇది యుపవాదమయ్యెను.

## (2) రోషభాషణము సంఫేటము

రోషములో మాటలాడుట సంఫేటము అనఁబడును.

ఉ. వేణీసంహారమునందు —‘ఓ కౌరవరాజ (దుర్యోధనుఁడ) పీకిబంధునాశదర్శన దుఃఖమేల! పాండవులు యుద్ధమునకుఁ జాలిన వారైయున్నారు. నేను సహాయములేనివాఁడనైయున్నాను. అని విషాదము నొందకుము. మా అయిదుగురలోపల ఎవనిని సులభముగా యుద్ధమునందు జయింపవచ్చునని తలఁతువో వానితోనే కవచము తొడిగినవాఁడవును ఆయుధములను బూనినవాఁడవునై యుద్ధోత్సవమును నడపుము’ అనఁగా విని దుర్యోధనుఁడు అసూయతో భీమార్జునులను జూచి భీమునితో నిట్లు పలికెను. ‘కర్ణదుశ్శాసనులను జంపుటవలని శత్రుత్వమును బట్టి నాకు మీయిద్దరును సమానులే. అయినను ప్రియసాహసుఁడవైన నిన్నే యుద్ధమునకు గోరెదను.” అని లేచి పరస్పరము కోపముతోడి బెదరింపులు దురుసైనవాదములను బ్రస్తావింపఁబడిన భయంకరమైన యుద్ధములం దీనిచేత భీమదుర్యోధనుల కోపపు మాటలాడుటవలన గెలుపుకనిడి బీజములోడి కూడికచేత ఇది సంఫేటమయ్యెను.

### (౩) వధబంధాదికము విద్రవము

చంపుట కట్టివేయుట మొదలగునది విద్రవము అనఁబడును.

ఉ. ఛలితరామమునందు—'ఎవనికట్టునకు ముఖములు త్రిప్పి మిక్కిలి శ్రమపడి సామములను జదువుదురో, ఎవఁడు బాలతనము నందు జపమాలికలను దాఁచిపెట్టి మరలఁ దెచ్చియిచ్చుచుఁ గ్రీడించునో, ఎవఁడు మా హృదయమో అలవకుమారుఁడు మూఁపులయందునిండ నాటింపఁబడిన బాణములతో మూర్ఛ యొసఁగెడి భయంకరమైన చీఁకటి కప్పుకొనఁగాఁ బరవశుఁడై కట్టి తీసికొని పోఁబడుచున్నాఁడు.' అనుటచేత కట్టు చెప్పఁబడెను.

రత్నావళియందు — మేడలకు బంగారుకలశము లెత్తినట్లు శోభిల్లెడి మంటలకొనలను, దట్టమయిన యుద్యానవనముల యందలి వృక్షములకొనలు కదలుటను గనఁబడఁజేసెడి మిక్కిలి తీక్ష్ణమయిన వేఁడిమిఁజిమ్ముఁగల అగ్ని సెగలపాటులచేత క్రీడా పర్వతములను నీటితోడి మబ్బుకప్పినట్లు నల్లఁదనము నొందించుచు స్త్రీజనులు కాలిపోక్కఁబడఁగా అంతఃపురమునందు మిక్కిలి వడిగా సెగయించుచున్నది."అను మొఱవిని, వాసవదత్త రాజుతో 'ఆర్యపుత్ర నాకుఁగా నేను చెప్పుకొనను దయమాలిన మనసుగల నాచేత కట్టివేయఁబడినదై సాగరిక విపత్తును పొందుచున్నది.' అనుటచేత సాగరికయొక్క వధము బంధము అగ్నిబాధ తెలియఁబడెను గనుక ఇది విద్రవము.

### (౪) గురుతిరస్కారము ద్రవము

గురువులనఁగా తల్లి తండ్రి యాచార్యుఁడు మొదలగువారు. వారిని తిరస్కరించుట ద్రవము అనఁబడును.

ఉ. ఉత్తరరామచరిత్రమునందు—లవుఁడు లక్ష్మణుని కొడుకుతో నీపెద్దలం విచారింపరాని చరిత్రముగలవారై యున్నారు. తాటకను జంపుటవలని యఖండమైన కీర్తి లోకము నందు మిక్కిలి ప్రాచ్యంబు వర్తిల్లుచున్నది. ఖరునితోడి యుద్ధము నందు మూఁడడుగులం వెనుకకుఁ బెట్టుటయుఁ బ్రసిద్ధమే. ఇంక వాలిని చంపుట యన్నచో నెల్లవారికి స్పష్టముగాఁ దెలియును.' అనుటచేత లవుఁడు గురువైన రాముని తిరస్కరించెను. కనుక ద్రవము. వేణీసంహారమునందు—యుధిష్ఠిరుఁడు భగవంతుఁడా కృష్ణాగ్రజుఁడా సుభద్రతోఁ బుట్టువా మనసునందు జ్ఞాతుల యందలి ప్రీతి గలంగదు. అది రాచవారికి ధర్మమే. అయినను తమ్మునికి అర్జునునితోడి స్నేహము ప్రసిద్ధమనుటయుం నీచేఁ దలఁచఁబడదయ్యెను. శిష్యులవలని స్నేహానుబంధము నీకు తుల్యమే కదా. అట్టుండ అదృష్టహీనుఁడనైన నాయందిట్టి విరసగుణమును వహించుట యిది యేమి మార్గము. ఇత్యాది వాక్యములచేత పూజ్యుఁడయిన బలరాముని యుధిష్ఠిరుఁడు తిరస్కరించెను. కనుక ద్రవము.

## (5) విరోధశమనము శక్తి

పగయణఁగుట శక్తి అనఁబడునని యర్థము.

ఉ. రత్నావళియందు — రాజు కపటములోఁ గూడిన ఒట్లచేతను ప్రియమయినమాటలచేతను మనసునకెక్కు నడచు కొనుటచేతను మిక్కిలియైన సంకోచభావముతో అడుగులపైఁ బడుటచేతను మాటిమాటికి కౌఁగిలింతలం జెప్పెడి మంచిమాటల

చేతను అలంగనిద్రిత రాజలోకము అట్టే యుద్ధ్య యందువలని కన్నీళ్లచేతఁ గడిగి వేసినదో యనునట్లు తనకుఁ దానే అణఁగి పోయెను.' అనుటచేత సాగరికపొందునకు విరోధియైన వాసవదత్త యొక్క కోపమునకు ఉపశమము అగుటవలన శక్తి యయ్యెను. ఉత్తరరామచరిత్రమునందు—లవుఁడు చెప్పు చున్నాఁడు ఈ మహాపురుషుని జూచినమాత్రముచేతనే నా అణఁగెను. సుఖాతిశయరూపమయిన యొకరసము ప్రసరించు చున్నది. అహంకారమనునది యెక్కడనో పోయెను. నన్ను వినయము వంచుచున్నది ఇంత శీఘ్రముగా నిట్లు పరాధీనుఁడ నగుటకు హేతువు తెలిసినది కాదు పుణ్యతీర్థములవలె మహా పురుషులకు ఏదో ఒక తెలియని మహిమగలదు." అనుటచేత లవుని విరోధమునకు ఉపశమము చెప్పఁబడెను. కనుక శక్తి యయ్యెను.

## (౮) తర్జనోద్వేజనములు ద్యుతి

తర్జనము = బెదరించుట, ఉద్వేజనము = కలవరపడుట. ఈ రెండునుగలచోట ద్యుతి అని చెప్పఁబడును.

ఉ. వేణీసంహారమునందు—భీముఁడు కృష్ణునిమాట విని 'రొల్లపాదరిండ్లచేతను నిండుకొని మిలిమిలాడు సంతోషముతో మెలఁగునట్టి యనేకములయిన జలచరముల యొండొంటితోడి కూడికగలదియు మీఁదికెగయుచున్న భయంకరములయిన మొసళ్లు కాళ్లుగలదియైన యీ సరస్సునీటిని గలఁచి కేలుచే బెదరించి యిట్లు చెప్పెను. ఓరి పరుసకువా నీవు నిర్మలమయిన చంద్రవంశమునందుఁ బుట్టితినని చెప్పుకొనెదవు. ఇప్పుడును గదను

చేత ధరించియున్నారు. దుశ్శాసనుని నులివెచ్చని నెత్తురగాఢి మద్యమును పానముచేసి మత్తుఁగొన్న శత్రుని నన్ను నిందించితిరి. మధుకైటభులను జంపిన శ్రీకృష్ణదేవుని విషయమున గర్వముచేతఁ గన్నుఁగానక దుష్టచేష్టలు చేసితిరి. ఇప్పుడు నావలని భయముచేత యుద్ధమునుమాని జిరదలో డాఁగితిరి. అతిరోషముతో లేచిరమ్ము' అనుటచేత దుర్వాక్యములాడుట సిగ్గను గలఁచుట అగాఢ పాండవుల గెలుపునకు అనుకూలమయిన దుర్యోధనుని నీటనుండి లేపుటకు హేతువులయిన భీమునిమాటలచేత ద్యుతి చెప్పఁబడెను.

## (7) గురుకీర్తనము ప్రసంగము

తల్లిదండ్రులు ఆచార్యులు మొదలుగాఁగల పెద్దలను బొగడుట ప్రసంగము అనఁబడును.

ఉ. రత్నావళియందు — 'దేవరా విదిముకు వాసవదత్త కాలిపోయినదని చెప్పి దేవరతో అతడు లేదబడినదగుచుండఁగా సింహళేశ్వరునిచేత ఇయ్యఁబడిన యశస్వితాఁకురితో, ఆ రత్నావళి యను నామెయే యీఁకె" అనుటచేత రత్నావళి లభించుటకు అనుకూలమయిన పక్కుల ప్రశంసను దెలిపెడి ప్రసంగమువలన నైన గురుకీర్తనముచేత ఇది ప్రసంగము. మృచ్ఛకటికయందు— చాండాలకుఁడు, 'సాగరదత్తుని కొడుకును పూజ్యుఁడయిన వినయ దత్తుని మనుమఁడునైన చారుదత్తునిచేత ధనలోభమువలన వసంతసేన యనువాడి భోగమంది చంపఁబడెను. అందులకై యీ చారుదత్తుండు చంపఁబడుటకు చంపుడుగట్టునకుఁ దీసికొని పోఁబడుచున్నాఁడు' అని చాటించునపుడు చారుదత్తుఁడు,

'ఏది యజ్ఞార్థము వచ్చి నిండుకొనియున్న బ్రాహ్మణుల వేద ఘోషము చేతను అనేకములయిన యజ్ఞములచేతను పరిశుద్ధమై ప్రకాశించెనో ఆ వంశము ఇప్పటి మరణదశయందు నీచ పురుషులచేత పాపములతోటి చాటువయందుఁ చాటింపఁ బడుచున్నది. అనుటచేత చారుదత్తుని చావకెడి వేలుపను అనుకూలమయిన ప్రసంగమువలన వాని పెద్దలయొక్క కీర్తనము చేయఁబడుటచేత ఇది ప్రసంగము.

### (8) అవమానన ఛలనము

(అవమానన తిరస్కారము)

ఉ. రత్నావళియందు —రాజు రాణి నాయందు అనువర్తనము లేనిదయ్యెను." అనుటచేత వాసవదత్తచే ఇష్టము కొలువేలమి వలన వత్సరాజు నవమానన ఆయ్యెను. కనుక ఇది ఛలనము.— రామాభ్యుదయమునందు సీతయొక్క విడచుటవలన రాముని యవమానన ఛలనము.

### (9) స్వశక్తి వ్యవసాయము

తన సామర్థ్యమును తెలిపెడిమాట వ్యవసాయ మనఁబడును

ఉ. రత్నావళియందు —ఇంద్రజాలికుఁడు, 'భూమియందుఁ జంద్రుని ఆకాశమునందుఁ బర్వతమును నీటియందు నిప్పును మధ్యాహ్నమునందు సంధ్యారాగమును గనఁబఱిచెదను. ఇఁక నేమి గావలెనో అనతిమ్ము. పలుమాటలవలన ఫలములేదు నా యీ ప్రతిజ్ఞను జిత్తగింపుము. నాగురుని మంత్రప్రభావముచేత నీమనసున నేదేది చూడఁగోరుదువో అది యది నీకుఁ జక్కఁగా జూపఁగలను.' అనుటచేత ఇంద్రజాలికుఁడు అబద్ధపునిప్పును

లేఁపుటచేత వత్సరాజు మనసునను్న సాగరికను జూచుతలఁపుగ నను కూలముగా తనకీర్తిని ప్రకటించెను. కనుక ఇది వ్యవసాయము. వేణీసంహారమునందు—ఇప్పుడు ప్రతిజ్ఞ చెడునేమో యని భయపడెడి యీ వీరునిచేత నీకోర్కె యిందువలన కొనసాగుచున్నది. దీని యాకర్షణమునందును సమర్థుఁడు వాఁడే అనుటచేత యుధిష్ఠిరుఁడు తన దండసామర్థ్యమును ప్రకటించుచున్నాఁడు. కనుక వ్యవసాయము.

## (10) సందర్భులక్ష్యోక్తి ! విరోధనము

పేరిరపాటునొందిన కార్యులయొక్క సొంతపుసామర్థ్యమును దెలిపెడిమాట విరోధనము అనఁబడును

ఉ. వేణీసంహారమునందు —దుర్యోధనుఁడు, ఓరోరి గాలి కొడుక యీవిధమున వృద్ధుఁడయిన రాజు యెదుట నింద్యమయిన స్వకర్మశ్లాఘ చేసికొనుచున్నావేమి. ఇది గాక ఓరిపశువా నీ పెండ్లామయిన ద్రౌపది ద్యూతదాసియై నీవును నీయన్నదమ్ములును దక్కినరాజులును జూచుచుండఁగా లోకనాయకుఁడనైన నాయాజ్ఞ చేత సిగఁబట్టి లాగఁబడెను. ఈ వైరానుబంధమునందు నీచేఁ జంపఁబడిన రాజులు ఏమి యుపకారము చేసిరి. భుజవీర్యము చేతను మిక్కిలి సారమైనబలము చేతను మదమువహించిన నన్ను జంపింపకయే నీకీగర్వమేలో' అనఁగా భీముఁడు కోపవికారమును జూపుచున్నాఁడు. అది చూచి అర్జునుఁడు 'అన్నా ఇచ్చట కోపముతో ప్రయోజన మేమి ప్రసన్నుఁడవగుము. వీఁడు మాటలచేత అప్రియములు చేయఁగలవాఁడు గాని పనియందుఁ

ఉ. వేణీసంహారమునందు.— పాంచాలకుఁడు యుధిష్ఠి
రునితో 'దేవుఁడు శ్రీకృష్ణదేవునిచేత అని మొదలుపెట్టి, సందేహ
పడవలదు. రాజ్యాభిషేకమునకై రత్నకలశములు నీళ్లచే నింపఁ
బడుఁగాక. కచములంబట్టి విడువఁబడియుండెడి ద్రౌపదీదేవి కొప్పు
నందు అలంకారములు కూర్పఁబడుఁగాక వాఁడియైన గండ్ర
గొడ్డలి చేతఁబూని క్షత్రియుల కెడ మ్రాఁకుల నెల్ల నఱకిన పరశు
రాముఁడో యనునట్లు కోపమువేఁ గన్నుగానని భీమసేనుఁడు
యుద్ధమునందుఁ బ్రవర్తింపఁగా జయమునకు సందేహ మెక్కడిది.
"ఇత్యాదులచే, రాజైన యుధిష్ఠిరుఁడు మంగళకార్యముల
చేయ నాజ్ఞాపించుచున్నాఁడు" అనునది మొదలుఁగల వాని
చేత ద్రౌపది కొప్పుముడుచుటయు, యుధిష్ఠిరుని రాజ్యాభి
షేకము మీఁద జరుగఁబోవునది యయ్యును నెఱవేఱినదిగాఁ
చెప్పఁబడెను కనుక ఇది ప్రరోచన.

## (12) వికత్థనము విచలనము

వికత్థనము = తన్నుఁదాను పొగడుకొనుట

ఉ. వేణీసంహారమునందు —అర్జునుఁడు గాంధారీధృతరాష్ట్రు
లతో ఓనాయనా, ఓయమ్మా మీకొడుకులచేత శత్రురాజుల
సందఱను జయింతుననెడియాశ యెవనియందుంచబడెనో ఎవని
గర్వముచేత లోకము తృణమువలె నవమానింపఁబడునో, అట్టి
కర్ణుని యుద్ధరంగమునందుఁ జంపిన అర్జునుఁడు తల్లిదండ్రులయిన
మిమ్ము నమస్కరించుచున్నాఁడు" అనియు, భీముఁడు, 'కురు
కుమారుల నెల్లను పొడిచేసినవాఁడును దుశ్శాసనుని నెత్తుటిచేత

మత్తుగొన్నవాఁడును దుర్యోధనుని తొడలను నఱకఁ దొవ్వువాఁడు నైన యీ భీముఁడు తలలో మ్రొక్కుచున్నాఁడు" అనియుఁ చెప్పుటచేత జయముగాడి బీజము ననుసరించిన స్వగుణములను భీమార్జునులు పొగడుకొనుటవలన ఇది విచలనము - రత్నావళి యందు—యౌగంధరాయణుఁడు 'నామాటవలన రాణికి అటువంటి రాజావలని వియోగము ఎట్లు పొందింపఁబడెనో అట్లే మఱియొక భార్యను రాజునకుఁ గూర్చుటవలని దుఃఖమును నాచే స్థాపింపఁబడెను, కనుక రాజుయొక్క సర్వలోకాధిపత్యలాభము చేత ఆమెకుఁ బ్రీతిని చేయగలను. ఇది నిజము అయినను సిగ్గుచేత ఆమెకు మొగమును జూప శక్తుఁడనుగాకయున్నాను దీనిచేత యౌగంధరాయణుఁడు అవ్యసనకలిని చెప్పవచ్చినవాఁడయ్యును నాచేత వత్సరాజునకు లోకనాయకత్వమును బొందింపడి కన్యకాలాభము కలుగఁజేయఁబడెను" అని స్వగుణమును పొగడుకొనుట వలన ఇది విచలనము.

## (13) కార్యసంగ్రహమాదానము

కునిరొయుఁగూడుట ఆదానము అనఁబడును.

ఉ. వేణీసంహారమునందు—భీముఁడు, ఓయి సమంతపంచకమునందు సంచరించు జనులారా, నేను రాక్షసుఁడను గాను, భూతమును గాను, శత్రువుల నెత్తురుగాడి పీటిచేతఁ జక్కఁగాఁ దడుపఁబడిన అవయములుగలవాఁడను, నెఱవేర్పఁబడిన ప్రతిజ్ఞయను గాఢసముద్రపుగవాగలవాఁడు నై క్రోధమునొందిన వ్యాఘ్ర[illegible]ను. యుద్ధముగాడి నిర[illegible]ంటిచేత కాలిపోఁగా మిగిలిన [illegible]

రాజపుత్రియులారా, మీకు భయమక్కఱలేదు. ఏభయము వలన వచ్చినగుల్మములయిన విఘ్నములయిన పొందులకుఁగాన వాఁగిరిరో తెలియదు'. అనుటచేత ఎల్ల శత్రువులకు జంపుట యనెడి పనిసేయవేరుట చెప్పఁబడెను. కనుక ఇది యాదానము.

రత్నావళియందు—సాగరిక దిక్కులను జూచి "ఓరా ఇప్పుడు మిక్కిలి వెలిఁగింపఁబడిన భగవంతుఁడగు వహ్ని దేవుఁడు నాదుఃఖమును తుదముట్టింపఁగలఁడు" అనుటచేత అన్యపరత్వముచేతనేనియు దుఃఖము తుదముట్టుట అనుదాని నెఱికొనుటవలన ఇది యాదానము. ఇవి పదుమూఁడును అవమర్శ సంధ్యంగములు. వీనియందు అపవాదము, శక్తి వ్యవసాయము ప్రరోచన ఆదానము అనునవి ముఖ్యములు.

౪౦. బీజవంతములయిన ముఖాదులయర్థము లొక్కటితో నొకటి సంబంధములేక చెదరిపోవునపుడు వాని నొకటిగాఁ గూర్చుట నిర్వహణము

బీజము గలవైన ముఖసంధి మొదలగువానియొక్క ప్రయోజనములు ఒకటితో నొకటి సంబంధములేక చెదరిపోవునపుడు వానినెల్ల నొకటిగాఁ గూర్చుట నిర్వహణము అనెడి సంధి యగును ఈసంధి ఉపసంహారము అనియుఁ జెప్పబడును (ఇందు ఫలాగమకార్యములకు సంబంధము)

ఉ. వేణీసంహారమునందు—కంచుకి దగ్గఱవచ్చి హర్షముతో "మహారాజా వర్ధిల్లుచున్నావు వర్ధిల్లుచున్నావు. ఇతఁడు దుర్యోధనుని నెత్తుటిచేత ఎఱ్ఱనైన సంశరీరముగలిగి చూడ

శక్యముగాని రూపముతోఁ గానవచ్చెడి మనచిన్నవాఁడయిన భీమసేనుఁడు కాఁడా" అను నిత్యాదులచేత ద్రౌపది కొప్పు ముడుచుట మొదలు గాఁగల వస్తూపములనుండి చివరిని ముఖసంధి మొదలగువాని బీజములు ఏకవిషయత్వముచేత నొక్కటిగాఁ గూర్పఁబడియెను కనుక ఇది నిర్వహణసంధి. రత్నావళియందు — ముఖసంధి మొదలగువానియందు చెదరిపోయిన సాగరికరత్నావళి వసుభూతి బాభ్రవ్యుఁడు మొదలగువారి ప్రయోజనములు వత్సరాజుయొక్క కార్యముకొఱకు కూర్పఁబడుట, వసుభూతి సాగరికను చూచి రహస్యముగా బాభ్రవ్యుఁడా చూడు మనరాజకూఁతురయిన రత్నావళిని బోలియున్నది." అను నిది మొదలగువానిచేఁ జూపఁబడుటయు నిర్వహణసంధి.

## ౪౧. ఫలాగమ కార్యసంబంధమువలన దీనికి సంధ్యాదు లంగములు పదునాలుగు

ఫలాగమముయొక్కయు కార్యముయొక్కయు సంబంధముచేత నిర్వహణసంధికి సంధి, విబోధము, గ్రథనము నిర్ణయము, పరిభాషణము, ప్రసాదము, ఆనందము, సమయము, కృతి భాషణము, ఉపగూహనము, పూర్వభావము. ఉపసంహారము ప్రశస్తి అని పదునాలుగు అంగము లగును.

### (1) బీజోపగమనము సంధి

బీజముయొక్క కూడిక సంధి యనఁబడును.

ఉ. రత్నావళియందు — వసుభూతి,' బాభ్రవ్యా యీచిన్నది, మనరాజకూఁతురును బోలియున్నది. బాభ్రవ్యుఁడు చూడుము

అట్లే తోఁచుచున్నది." అనుటచేత సాయిక బీజముయొక్క కూడికయగుటవలన సంధి—వేణీసంహారమునందు—భీముఁడు, "యజ్ఞవేదికయందుఁ బుట్టిన రాజపుత్రియుంరాలా నేను మునుపు చెప్పినమాట నీవు మఱువవుగదా, చలించెడి భుజముల చేతఁ ద్రిప్పఁబడిన గదదెబ్బచేఁ బొడిచేయఁబడిన తొడలజంటగల దుర్యోధనునిదయిన జిగటగల నెత్తురంటుకొన్న చేతులతో భీమసేనుఁడు నీతలవెంట్రుకలను ముడువఁగలఁడు" అనుటచేత ముఖసంధియందుఁ దెలుపఁబడిన బీజమునకు మరల కూడిక యగుటవలన సంధి.

## (2) కార్యమార్గణము విబోధము

(మార్గణము = వెదకుట).

ఉ. రత్నావళియందు—వసుభూతి, (గమనించి చూచి) "దేవరా యీకన్యక యెక్కడిది. రాజా, రాణి యెఱుఁగుదుఁ వాసవదత్త ఆర్యపుత్ర ఇది సాగరమువలన లభించినది యనిచెప్పి మంత్రియైన యౌగంధరాయణుఁడు నాకు ఒప్పించెను. గనుక ఇది సాగరికయని చెప్పఁబడుచున్నది రాజు (తనలో) యౌగంధరాయణునిచేత నాకుఁ దెలియక యెట్లు నీకు ఒప్పింపఁబడెను." అనుటచేత రత్నావళీ రూపకార్యమును వెదకుటవలన విబోధము. వేణీసంహారమునందు—భీముఁడు 'అన్నా ఒకక్షణకాలము నన్ను విడువు విడువు. యుధిష్ఠిరుఁడు ఏమి మిగిలిపోయినది. భీముఁడు' మిక్కిలి దొడ్డకార్యము మిగిలియున్నది. దుశ్శాసనుని నెత్తుటఁ దడిసిన చేతితో వానిచేత లాగి చిక్కుపఱుపఁబడిన

ద్రౌపది తలవెండ్రుకలను ముడివేసెదను. యుధిష్ఠిరుఁడు శీఘ్రము దయచేయఁదగినదైన ద్రౌపది వేణీసంహారమును అనుభవింప నిమ్ము" అనుటచేత వెండ్రుకలను ముడుచుట అనెడి కార్యము వెదకఁబడుటవలన విరోధమయ్యెను.

— (౩) దానియుపక్షేపము గ్రథనము —

ఆకార్యమార్గణముయొక్క తెలిపిడి గ్రథనము అనఁబడును.

ఉ. రత్నావళియందు — యౌగంధరాయణుఁడు దేవరా నాచే దమకుఁ దెలియక చేయఁబడిన యీపనికి నన్ను మన్నింతురుగాక.' అనుటవలన వత్సరాజునకు రత్నావళిని పొందించుట యనెడి కార్యమార్గణము తెలియఁజేయఁబడెనుగాన గ్రథనము. వేణీసంహారమునందు భీమసేనుఁడు నేను బ్రతికియుండఁగా దుశ్శాసనునిచేతఁ జిక్కు బరుపఁబడిన తలవెండ్రుకలను నీచేతితో ముడుచుకోవలెనా ఉండుముండుము నాయంతట నేనే ముడిచెదను," అనుటచేత ద్రౌపది కొప్పు ముడుచుట యను కార్యము తెలుపఁబడెను కనుక గ్రథనము.

— (౪) అనుభూతాఖ్యానము నిర్ణయము —

అనుభవమైన యర్థమును చెప్పుట నిర్ణయము అనఁబడును.

ఉ. రత్నావళియందు — యౌగంధరాయణుఁడు, చేతులు జోడించుకొని దేవరా చిత్తగింపుము. ఈమె సింహళేశ్వరుని కూఁతురు. ఈమెను ఎవఁడు చేపట్టునో వాఁడు సర్వభూమికిఁ బ్రభువైనరాజు కాఁగలఁడు (చక్రవర్తి కాగలఁడు) అని యొకసిద్ధుఁడు చెప్పెను. అందుల నమ్మకముచేత ఏలినవారి

నిమిత్తము బహుపర్యాయములు సింహళేశ్వరుఁడు నాచే వేఁడుకోఁబడినవాఁడయ్యెను రాణియైన వాసవదత్తకు మనః ఖేదము గలుగునని చెప్పుచును ఈపెండ్లి కియ్యకొనినవాఁడయ్యెను. ఆకారణమువలన సింహళమునందలి యుప్పుబేరము చేయువారి సంఘమునందు వాసవదత్త కాలిపోయినది అనుమాట యొకటి పుట్టించి దాని నతనికిఁ దెలుపుటకు బాభ్రవ్యుఁడు పంపఁబడెను అనుటచేత యౌగంధరాయణుఁడు, తన యనుభవవిషయమును చెప్పెను గనుక నిర్ణయము. వేణీసంహారమునందు —భీముఁడు, రాజరాజనైన యజాతశత్రుఁడా ఇప్పుడును దుర్యోధనుఁ డున్నాఁడా నాచేగవాఁడయిన యాదురాత్ముని దేహమును నేలఁబడవైచి, నాయీదేహమునందు, వాని నెత్తురు గంధము పూసినట్లు పూసికొనఁబడెను నాలుగు సముద్రములే యెల్లలుగాఁ గలభూమితోడ, జయలక్ష్మి పూజ్యులయిన దేవరవారిని పొందెను. బాణ్టతోను కెలికాంద్రతోను, యుద్ధము చేయువారలతోను కౌరవుల గుంపంతయు ఈయుద్ధాగ్నియందు దగ్ధమయ్యెను. రాజేంద్రా ఇఁక నిప్పుడు మీరు చెప్పిన దుర్యోధనుని పేరొక్కటిమాత్ర మిగిలియున్నది." అనుటచేత భీమసేనుని యనుభవవిషయము చెప్పఁబడెను.

### (౩) మిథోజల్పనము పరిభాషణము

ఒండొరులు కలసిమాటలాడుట పరిభాషణము అనఁబడును.

ఉ. రత్నావళియందు —రత్నావళి (తనలో) తప్పుచేసిన నేను రాణి ముఖము చూడ శక్తురాలను గానేరను. వాసవదత్త

(కన్నీళ్లు విడుచుచు) చేతులు చాఁచి, ఓకతితురా—! ఇటు రమ్ము. ఇట్టిదయినను బంధుస్నేహమును జూపుము:" అని, రహస్యముగా ఆర్యపుత్ర: యా ధూర్తత్వము చేత నేను నిగ్గుపడినదాననుగదా. ఆ కారణముచేత, దీనికట్టును తెలియగా విప్పివేయుము" రాజు అట్లే కానిమ్ము అని రాణికట్టినకట్టును విప్పుచున్నాఁడు. వాసవదత్త వసుభూతిని జూచి అయ్యా మంత్రియయిన యౌగంధరాయణునిచేత చెడ్డదాననుగాఁ జేయఁబడితిని. దీనిసంగతి ఎఱిఁగినవాఁడయ్యెను, వాఁడేఁ జెప్పఁడయ్యెను', అనునీపరస్పరపుమాటల వలన నిది పరిభాషణము

వేణీసంహారమునందు —భీముఁడు. ఏనరపశువైనదుశ్శాసనునిచేత రాజసభయందు ద్రౌపది కొప్పుపట్టి యీడ్వఁబడెనో" అనునది మొదట ఎక్కడ భానుమతి పాండవులభార్యను అవమానింపలేదా! అనునదితుదగాఁగల పరస్పరపుమాటలవలన ఇది పరిభాషణము.

## —● (6) పర్యుపాసనము ప్రసాదనము ●—

మేలయిన సేవచేయుట ప్రసాదనము అనఁబడును.

ఉ రత్నావళియందు — దేవరా ప్రసీదింతురుగాక" అను విది మొదలగువానిచేతఁ జూపఁబడెను.

వేణీసంహారమునందు —భీమసేనుఁడు ద్రౌపదిదగ్గఱకు బోయి "రాణి ద్రౌపదీ సంతోషము. శత్రుకులక్షయము చేత వర్ధిల్లుచున్నావు" అనుటచేత, ద్రౌపది భీమసేనునిచే గౌరవింపఁబడినది అగుటవలన ఇది ప్రసాదనము.

## (7) వాంఛితావాప్తియానందము

కోరినకోరిక నెఱవేఱుట ఆనందము అనఁబడును.

ఉ. రత్నావళియందు —రాజు రాణి చెప్పినచొప్పున రత్నావళిని గ్రహించుచున్నాఁడు ఇందు రత్నావళిని గ్రహించుట కోరినకోరిక నెఱవేఱుట.

వేణీసంహారమునందు — ద్రౌపది ఓ ప్రాణనాథా ఈ కురుని మఱచితిని. ప్రియుని అనుగ్రహమువలన మరల శిక్షింపఁబడఁగలను" అని తలవెండ్రుకలను ముడుచుచున్నది. ఇందు ద్రౌపదికోరిన కోరిక తలవెండ్రుకలుముడుచుట వీనిచేత వత్సరాజద్రౌపదులకోరికలు నెఱవేఱుటవలన ఇది యానందము.

## (8) దుఃఖనిర్గమము సమయము

పొందఁబడినదుఃఖము తొలఁగుట సమయము అనఁబడును.

ఉ. రత్నావళియందు —వాసవదత్త రత్నావళిని కౌగిలించుకొని, 'చెల్లెలా! ఊఱడిల్లు మూఱడిల్లుము', ఇందువాసవదత్తా రత్నావళుల పరస్పరసమాగమముచేత దుఃఖముపోవుటవలన ఇది సమయము.

వేణీసంహారమునందు — యుధిష్ఠిరుఁడు భగవంతుఁడును పురాణపురుషుఁడునైన శ్రీమన్నారాయణుఁడు తాను యెవనికి శుభములను గోరుచుండునో ఆపుణ్యాత్మునికి గెలుపుతప్పు నటే యేమియగును దొడ్డవియయిన మహాత్త్వము మొదలగు తత్త్వములకలఁతపాటును గలిగించువాఁడును తనంతట గ్రహింపఁబడిన శరీరము గలవాఁడును, ఎల్లమంచిగుణములును గలవాఁడును, ప్రజల

యొక్క జన్మస్థితిలయములకు హేతువైనవాఁడును, పుట్టుకలేని వాఁడును, చావులేనివాఁడును, ఇట్టివాఁడని విచారించి తెలిసికొన శక్యము కానివాఁడును నయినవిన్నుఁదలచి యాలోకము దుఃఖ-మునుండి కరించుచుండఁగా, ప్రత్యక్షమున నిన్నుఁ జూచునప్పుడు చెప్పవలసినదేమి" అనుటచేత యుధిష్ఠిరుని దుఃఖము తొలఁగి పోవుట కానవచ్చుచున్నది కనుకసమయము.

### (9) లబ్ధార్థశమనము కృతి

లభించినప్రయోజనము స్థిరముగా నిలుచుట కృతిఅనఁబడును.

ఉ. రత్నావళియందు — రాజు రాణియనుగ్రహము నొందు గౌరవింపుఁడు, వాసవదత్త దానిపుట్టినిల్లు దూరము. ఎట్లునడపినయెడల అదితనవారిని దలఁపకుండునో అట్లునడుపుము. అనునీయన్యోన్యముల మాటలచేతలభించిన కోరికయయిన రత్నావళి పొంది కూటమియందురాజునకు స్థిరత్వము సిద్ధించెను కనుకకృతి.

### (10) మానాద్యాప్తి భాషణము

సన్మానము మొదలగు గౌరవముయొక్క సంప్రాప్తి భాష-ణము

సన్మానము మొదలగుగౌరవముయొక్క సంప్రాప్తి భాషణము.

ఉ రత్నావళియందు —రాజు యౌగంధరాయణునితో దీని కంటెఁ బ్రియముకు గలదా. ఈ భూమండలమునందు విక్రమబాహువు తనవైనసామాన్యస్థితిలేని పొందెను. సముద్రపర్యంతమయిన భూప్రభుత్వము లభింపఁ గారణమైన ప్రియురాలు సాగరిక లభించెను. రాణియు నీచెల్లెలిలాభమువలన సంతోషించెను.

కోసలదేశము జయింపఁబడెను. ఉత్తముఁడయిన మంత్రివి నీవు కలుగఁగా ఏమి కలుగదు. ఇఁక దేనియందపేక్ష పడుదును". అగుట చేత కామము, అర్థము, మానము మొదలగు వానిలాభము అగుట వలన భాషణము.

### (11) కార్యదర్శనము పూర్వభావము

ఇష్టమయినదానిని గాంచుట పూర్వభావమనఁబడు

ఉ. రత్నావళియందు — యౌగంధరాయణుఁడు ఇట్లు తెలిసి చెల్లెలిఁ జేయఁదగినకార్యమునందు రాణిగారే ప్రమాణముగా (ప్రత్యక్షముగఁ దెలియఁదగిన కారణముగా) ఉన్నారు.' వాసవదత్త దీనిరత్నమాలికను ఇమ్మని తేటగాఁ దెలియఁజేసెను; అగుటచేత వత్సరాజునకు రత్నావళి నీయవలయుననెడి యౌగంధరాయణుని యభిప్రాయము ననుసరించినట్లు వాసవదత్తచేతఁ జూపఁబడెను. కనుక పూర్వభావము.

### (12) అద్భుతప్రాప్తి యుపగూహనము

ఆశ్చర్యము కలుగుట యుపగూహన మనఁబడు.

ఉ. వేణీసంహారమునందు — నేపథ్యమున (తెరవెనుక) మహాయుద్ధమనెడి అగ్నియందుఁగాలిపోఁగా మిగిలినరాజుల సమూహమునకు మేలగుఁగాక. దేని విడుపువలన గాయము పొందినరాజులుంగలవారును, కోపముచేతఁగన్నుగానని వారునైన పాండుకుమారులు అనేకులనురాజులను జంపి ప్రతిదినమును ప్రతి దిక్కునందును ఆరాజులయంతఃపురస్త్రీలను విడువఁబడిన కొప్పులు గలవారినిగాఁ జేసిరో, కోపించినయమునిఁ బోలినదియును, కురు

కులకు ధూమకేతువైన యాద్రౌపది కొప్పు సంతోషముతో ముడువఁబడెను. ఇఁక నెల్లరాజులకును మేలగుఁగాక. జనులకాప్ర మానుసుగాక" అనుమాట వినఁబడియెను యుధిష్ఠిరుఁడు ప్రియం రాజా! కువీతలవెంద్రుకలు ముడుచుట ఆకాశమునందు సంచరించెడి సిద్ధజనముచేత పొగడఁబడుచున్నది". అనుటచేత సిద్ధులు పొగడుట అనుమహాశ్చర్యము కలిగెను గనుక ఉపగూహనము ఇందు లభించిన ద్రౌపదికొప్పుముడుచుటయను ప్రయోజనము స్థిరమయ్యెను గనుక ఇది కృతియగును.

## (13) వరాప్తి కావ్యసంహారము

మేలయిన కోరికను పొందుట కావ్యసంహారము అనఁబడును.

ఉ. 'ఇంకను నీకేమి మేలు చేయవలెను. ప్రియమైనయాయుపకారమును చేసెదను' అనుటచేత కావ్యార్థము ముగియుటచేత కావ్యసంహారమయ్యెను. ఇది ఉపసంహారము అనియుఁ జెప్పఁబడియెడి.

## (14) శుభశంసనము ప్రశస్తి

మేలుకోరుట ప్రశస్తి అనఁబడును.

ఉ. వేణీసంహారమునందు —స్వామీ, 'నీవు మిక్కిలి ప్రీతినొందిన వాఁడవగుదువేని అదియట్లు కానిమ్ము. ఎల్ల జనములు ఉదారబుద్ధితో నూతేండ్లు జీవించుగాక. పురుషోత్తముఁడగు నీయందు నిరంతరభక్తి కలుగనిమ్ము రాజగువాఁడు జనులయెడ ప్రీతిగలవాఁడును, విద్వాంసులకు చుట్టమగువాఁడును, గుణా

గుణముల తారతమ్య మెఱిఁగినవాఁడును, ఎల్లప్పుడును భూమండలము తనకుఁ బ్రభుత్వముచేయువాఁడును అగుఁగాక." అని మేలుంగోరుటవలన ఇది ప్రశస్తి.

ఇవి పదునాలుగు నిర్వహణసంధ్యంగములు. ఇట్లు అఱువది నాలుగంగములతోఁగూడిన అయిదు సంధులు చెప్పఁబడెను. ఇఁక నీయంగముల ప్రయోజనము వివరింపఁబడియెడి.

౮౨. ఉక్తములగు నీయంగము లఱువదినాలుగింటికి
ప్రయోజనంబు షడ్విధంబు.

ఈచెప్పఁబడిన అయిదుసంధులయంగములు అఱువది నాలుగింటియొక్క ప్రయోజనము ఆఱువిధములు గలదియగును.

౮౩. అవి వివక్షితార్థనిబంధనము, గోప్యార్థగోపనము, ప్రకాశ్యార్థప్రకాశనము, అభినయరాగసమృద్ధి, చమత్కారకారిత్వము, కావ్యవిస్తరము నాఁబడు.

ఆ ప్రయోజనము లాఱును వివక్షితార్థనిబంధనము (చెప్పఁగోరినవిషయముయొక్క యేర్పాటు) గోప్యార్థగోపనము, (దాఁచఁదగిన విషయమును దాఁచుట) ప్రకాశ్యార్థ ప్రకాశనము (వెల్లడిచేయఁదగిన విషయమును వెల్లడి చేయుట) అభినయరాగసమృద్ధి (అభినయముయొక్కయు రాగముయొక్క పరిపూర్తి) చమత్కారకారిత్వము (నేర్పుచేత వింతను బుట్టించుట కావ్యవిస్తరము. (కథను పెంచి చెప్పుట) అని చెప్పఁబడునని మూర్ధయ.

౪౪. వస్తువునకు సర్వంబునకు సూచ్యంబు దృశ్యం
బని ద్వివిధవిభాగంబు కర్తవ్యంబు.

ఇటువంటి కథకును సూచ్యము (సూచింపఁ దగినది) దృశ్యము (చూపఁదగినది) అనిరెండు తెఱఁగులవిభాగము చేయనగును. (సూచించుట = పర్యాయముగాఁ దెలియఁజేయుట

౪౫. అందు నీరసం బనుచితంబు సూచ్యంబు

ఆకథయందు రసహీనమును అనుచితమునైనది సూచింపఁ దగినది.

౪౬. తదితరంబు దృశ్యంబు

సరసమైన తక్కినకథయంతయు ఇంపయినదియు గంభీరము లయినదియునై సరసభావముల చేత విశదముగాఁ జూపఁదగినది.

౪౭. సూచ్యమర్థోపక్షేపకములయిన విష్కంభ
చూలికాంకాస్యాంకావతార ప్రవేశములైదింటి
చేతఁ బ్రతిపాదింపనగు.

సూచ్యమయినకథ విషయబోధకము లయిన విష్కంభము, చూళిక, అంకాస్యము, అంకావతారము, ప్రవేశకము అనెడి యయిదు మార్గములచేతఁ దెలుపఁదగినది.

౪౮. మధ్యమపాత్ర ప్రయోజిత వృత్తవర్తిష్య
మాణ కథాంశములఁ దెలుపు సంక్షేపార్థము
విష్కంభము

మధ్యమ పాత్రములచేతఁ దెలుపఁబడెడి జరిగినవియు జరుగఁ బోవునవియు నైన కథావయవములను సూచకము చేయునట్టి సంక్షేపార్థము విష్కంభము అనఁబడును.

౪౯. అది పాత్రభేదము వలన శుద్ధము సంకీర్ణమని ద్వివిధము.

ఆవిష్కంభము ఒకటియేని రెండేని మధ్యమపాత్రములచేఁ నడపఁబడునదియగునేని శుద్ధమనియు, మధ్యమపాత్రములయు అధమపాత్రములయు చేరికచేత నొక్కట నడపఁబడునది యగునేని సంకీర్ణమనియు రెండువిధములగును (కేవలసంస్కృతభాష గలది శుద్ధము సంస్కృత ప్రాకృతభాషలు కలసినది సంకీర్ణము (మిశ్రము) అనఁబడునని కొందఱు అది సంస్కృతనాటకము లకే గ్రాహ్యము )

౫౦. యవనికాంతరితపాత్రములచే నగునర్థ సూచనము చూళిక.

తెఱమఱుఁగుననుండు పాత్రములచేతఁ జేయఁబడెడి యర్థ సూచనము (విషయమును దెలుపుట) చూళిక యనఁబడును.

ఉ. ఉత్తరరామచరిత్రమునందు — రెండవయంకము మొదట నేపథ్యమునందు ( తెఱమఱుఁగున ) తపోధనురాలియొక్క మంచిరాక కలిగెను. అనఁగానే తపోధనురాలు ప్రవేశించు చున్నది ఇచట నేపథ్యపాత్రమయిన ( తెరమఱుఁగున నుండు పాత్రమైన) వాసంతికచేత తపోధనురాలైన ఆత్రేయిరాక సూచింపఁబడెను.

వీరచరితమునందు నాలవయంకము మొదట నేపథ్యమునందు (తెరయందుగున) 'ఓ వైమానికులారా మంగళములను" నడుమ దురుగాక, నడుపుదురుగాక, కృశాశ్వుని శిష్యుఁడును పూజ్యుఁడు నైన కౌశికమునీశ్వరుఁడు సర్వోత్కృష్టుఁడై వర్తించు చున్నాఁడు. సూర్యవంశ మిప్పుడు లోకమునందు జయశీలు రైన రాజులుఁగలదియయ్యెను. రాజులకెల్లను పగవాఁడయిన పరశురాముని గెలిచి లోకమున కభయమిచ్చెడి వ్రతమును బూనినవాఁడును లోకమునకు శరణు చొరఁదగినవాఁడును సూర్యవంశమునకుఁ జంద్రుఁడు నైన శ్రీరాముఁడు సర్వోత్కృష్టుఁడై వర్తించుగాక." ఇందు నేపథ్యపాత్రములయిన దేవతలు రామునిచేత పరశురాముఁడు గెలువఁబడెను. అనుట యొక్క సూచనము చేయుటవలన ఇది చూళిక యయ్యెను.

## ౫౧. అంకాంతపాత్రములచేనగు నుత్తరాంకార్థ సూచన మంకాస్యము.

ఒకయంకము తుదనుండు పాత్రములచేత దానిమీఁది యంకముయొక్క యర్థము సూచింపఁబడుట - అనఁగా తొలు తటి యంకము తుదను ఉన్నపాత్రములే యందఁదెలుప యర్థ మును మీఁదియంకముయొక్క ప్రారంభము నందుఁ దెలియఁ జేయుట అంకాస్యము అనఁబడును.

ఉ. వీరచరిత్రమునందలి రెండవయంకము తుదిని—సుమంత్రుఁడు ప్రవేశించి, పూజ్యులయిన వసిష్ఠ విశ్వామిత్రులు పరశురాములతోఁగూడిన మిమ్ముఁ బిలిచెదరు. వారు, ఆ పెద్దలెక్కడ

ఉన్నారు. సుమంత్రుఁడు, మహారాజయిన దశరథుని యొద్ద. వారు, వారియిష్టము చొప్పున నక్కడకే వచ్చెదము. "అని యిట్లు విషయము ముగియుచుండఁగా, అంతట వసిష్ఠ విశ్వామిత్ర పరశురాములు వచ్చి కూర్చుండిరి." అను నెడ తొలుతటియంకము కడపటనే ప్రవేశించిన సుమంత్రపాత్రముచేత శతానంద జనకుల కథావిషయమెఱుఁగుటను మీఁదటి యంకము మొదట సూచింపఁబడుటవలన నిదియంకాస్యమయ్యెను.

గీ. అంకాంత పాత్రము తదంకార్థ సంబంధము
చేతనే చేయుముత్తరాంకార్థ సూచన మంకావ
తారము.

ఒక యంకము ముగియఁగ యందుండు పాత్రము ఆ యంకము నందలి యర్థసంబంధము చేతనే ప్రవేశకము విష్కంభము మొదలగునవి లేక మీఁది యంకము మొదట నారంభించెడి కథా సూచనము అంకావతారము అనఁబడును. ఇందు పూర్వాంక పాత్రములచే యను ప్రవేశమగుటఁబట్టి యుత్తరాంత పాత్ర సూచన లేదు

ఉ. మాళవికాగ్నిమిత్రమునందలి మొదటి యంకము తుదిని—విదూషకుఁడు, దీనిచేతనే యుద్ధమును రాణిగారి వేడుక చూచు నింటికిఁ బోయి సంగీతోపకరణములను చేసికొని యుండుండి దూతను పంపిరి. అట్లు కాని యెడ మన మద్దెల మ్రోఁతయే దీని తేలఁగలదు." అని మొదలుపెట్టి, మద్దెల మ్రోతవినిన పిమ్మట ఎల్లపాత్రములును ప్రథమాంకమునఁదు వెడలిపోయినవే

వచ్చుట యొక్క తోఁచిక ద్వితీయాంకము మొదట బ్రారంభింప బడియెను. ఇందు ప్రథమాంకము యొక్క యర్థ సంబంధము విడకయే ద్వితీయాంకము యొక్క ప్రారంభము అగుటవలన ఇది యంకావతార మయ్యెను.

౫౩. విష్కంభమువలెననుదాత్తోక్తిచే నీచపాత్ర ప్రయోజితమగు నంకద్వయ సంబంధ సూచనము ప్రవేశకము.

విష్కంభమువలెనే నీచములయిన మాటలచేత నీచ పాత్రములచే రెండంకముల నడిమికథాసంబంధము తెలుపఁబడుట ప్రవేశకము అనఁబడును. ఇది ప్రథమాంకమునందుఁ బ్రవర్తింపకూడదు.

౫౪. వీనిచే సూచ్యమును సూచించి దృశ్యము నంకములం జూపనగు.

ఈ చెప్పఁబడిన విష్కంభాదులచేత సూచ్యమైన కథను సూచనచేసి దృశ్యమయిన కథను అంకములచేఁ గనఁబరుప వలయును.

౫౫. నాట్య ధర్మముంబట్టి వస్తువు మరలఁ ద్రివిధంబగు.

నాట్యస్వభావము ననుసరించి యాకథ మరల మూఁడు విధములుగా భాగింపఁబడునని యర్థము.

౫౬. అది సర్వశ్రావ్యము నియతశ్రావ్య మశ్రావ్య మనంబడు.

ఆ త్రివిధ విభాగము సర్వశ్రావ్యము (అందఱు విన(దగినది.) నియతశ్రావ్యము (కొందఱె విన(దగినది.) అశ్రావ్యము (ఎవ్వరును విన(దగనిది) అని చెప్పఁబడును.

౫౭. సర్వశ్రావ్యము ప్రకాశ మశ్రావ్యము స్వగత
మనంబడు

సర్వశ్రావ్యము ప్రకాశమనియుం అశ్రావ్యము స్వగత మనియుం జెప్పఁబడును.

౫౮. అన్యంబు జనాంతికాపవారిత భేదంబు వలన
ద్వివిధంబు.

మఱియొకటి యగు నియత శ్రావ్యము జనాంతికము, అపవారితము, అని రెండు భేదములు గలది యగు.

౫౯. త్రిపతాక హస్తముచే నితరులు వినకుండ మాటు
చేసి యొండొరులఁ బిలుచు కొని రహస్యముగా
నడపెడు కథ జనాంతికము.

(త్రిపతాక హస్తము కొటనవ్రేలు వంచి చూపుడు వ్రేలి కొందటఁ కూర్చి యుంగరపు వ్రేలిని వంచి తక్కిన వ్రేళ్లను జాచి పట్టిన హస్తము.

౬౦. ఒకని ప్రక్కకుఁ దిరిగి వానితో రహస్యముగాఁ
జెప్పుట యపవారితము.

ఆ. నాట్యధర్మ ప్రసంగము వలన నాకాశ భాషితమును ఇచట నిరూపింపఁబడును.

౬౧. ఏమిచెప్పెద విత్యాది ప్రశ్నములేక యొకని చేతఁ జెప్పఁబడినదయ్యుఁ దనంతఁ బాత్రము వినఁ బలుకఁబడునది యేదో యది యాకాశ భాషితము.

౬౨. అన్యంబులు ప్రథమకల్పాది నాట్యధర్మంబులు కొన్ని యుదాహృతంబు లయ్యెవి నామ మాలా ప్రసిద్ధంబులు.

ఈ చెప్పఁబడినవి గాక మఱికొన్ని ప్రథమకల్పము మొదలగు నాట్యధర్మములు చెప్పఁబడియున్నవి అవి పేళ్లవరుసచేతనే ప్రసిద్ధము లయినవి. మఱియును నవి భరత సంబంధమయినవి కాక కొన్ని దేశభాషలయందే వాడఁబడుచు నాట్యధర్మత్వము లేని వగుట వలన వానికిట లక్షణము చెప్పక విరమింప నయ్యెను.

ఈ శాస్త్రమునం దీ చెప్పఁబడిన వస్తుభేద సముదాయము రామాయణాదులను బృహత్కథను జూచి తెలిసికొని పిమ్మట నాయకుని యొక్కయు రసము యొక్కయు రీతికిఁ దగినట్టు యుక్తములయిన మంచి మాటలనుకూర్చి చిత్రమైన యొకకథను రచియింపవలసినది అట్లు రచియించిన వానియందు బృహత్కథ మూలముగాఁ గలది ముద్రారాక్షసము, రామాయణము మూలముగాఁగలది వీరచరితము మొదలగునవి.

ఇది పూర్వభాగము.



# దశరూపక సంగ్రహము

## ఉత్తర భాగము

అ. నాటకాదులయందలి వస్తునేతృ రసములయొక్క యంశ విభాగ మిందుఁ జెప్పఁబడుచున్నది. అందు ప్రకరణము మొదలగు రూపకములకుఁ బ్రకృతియు, తఱచుగా రసపరిగ్రహము గలదియు, జెప్పఁబడిన లక్షణము లన్నియుఁ గలదియు నగుటవలన నాటకము నందలి యంశవిభాగము తొలుతఁ జెప్పబడును. (నాటకము జెప్పఁబడిన రూపకధర్మము లన్నియుఁ గలదగుట వలనఁ గొన్ని ధర్మములు లేనివైన తక్కిన రూపకములకుఁ బ్రకృతి యయ్యెను.

౧. సూత్రధారుఁడు పూర్వరంగముఁ గావించి వెడలుడును నటుఁడు ప్రవేశించి యట్లు కావ్యమును స్థాపింప నగు.

నాటకమునందు మొట్టమొదట సూత్రధారుఁడు వచ్చి పూర్వరంగమును గావించిపోఁగా వానికంటె నితరుఁడైన నటుఁడు వచ్చి వానివలెనే వైష్ణవస్థానకాదులచేతఁ గావ్యార్థమును స్థాపింపవలయును. కావ్యార్థమును స్థాపించుటవలన వాఁడు స్థాపకుఁడు అనఁబడును. పూర్వరంగము=తొలుత సభికులను రంజింపఁజేయు క్రియ—అనఁగా రంగమునందు సూత్రధారుఁడు ప్రవే

ంచి చేయుదేవతా ప్రార్థనము మొదలగునది. ఇది వినాయక తాళము అనియుఁ జెప్పబడును.

కావ్యమును స్థాపించుట=కావ్యము యొక్క విషయమును సూచనచేయుట వైష్ణవస్థాపకము = ఎదరొందముగా అడుగులు వేయుచు నర్తించుట స్థానకాదులు అనుటచేత తాండవము మొదలగు రౌద్రస్థాపకములును గ్రాహ్యములు.)

౨. స్థాపకుండు దివ్య మర్త్యోభయ వస్తువుల సూచించు నెడలఁ దద్రూపకుండగు.

స్థాపకుఁడైన నటుఁడు వస్తువు (కథాశరీరము) దివ్యము (దేవసంబంధమయినది) అగునేని దివ్యుఁడును (దేవతాస్వరూపుఁడును) వస్తువు మర్త్యము (మనుష్యసంబంధ మయినది) అగునేని మర్త్య (మనుష్య) స్వరూపుఁడును, వస్తువు, మిశ్రము. (దివ్యమర్త్యముల కూడిక కలది) అగునేని దివ్యమర్త్య పురుషులలో నెవఁడే నొకని స్వరూపము గలవాఁడునై కావ్యార్థమును సూచింపవలయును.

3. సూచ్యంబు వస్తు బీజ ముఖ ముఖపాత్రములం దేదే నొండగు.

కావ్యార్థ సూచన చేయునెడ వస్తువు బీజము, ముఖము, పాత్రము వీనియందు దేని నే నొకటిని సూచన చేయునగునని యర్థము.

ఉ. (వస్తువునకు) ఉదాత్త రాఘవమునందు.—రాముఁడు తండ్రి యాజ్ఞను పూదండనువలె తలను ధరించి యడవికిఁ బోయెను. ఆరాముని వలని భక్తిచేత భరతుఁడు తన తల్లితోఁ ద

రాజ్యమును విడిచెను. ఆరాముని నాశ్రయించి సుగ్రీవుఁడును విభీషణుఁడును సర్వోత్కృష్టమయిన సంపదను బొందిరి శత్రుకాముచేత మిక్కిలి గర్వించియున్న రావణుఁడు మొదలుగాఁ గల శత్రువులెల్లవారును రామునిచేతఁ జంపఁబడిరి.

(బీజమునకు) రత్నావళియందు — "అనుకూల మయిన దైవము ద్వీపాంతరము నుండియేని సముద్రము నడుమనుండి యేని దిక్కులకడలనుండియేని కోరిన పదార్థమును శీఘ్రముగఁ దెచ్చి చేర్చును.

(పాత్రమునకు) శాకుంతలమునందు — "నీవు పాడిన మనో హరమైన రాగముచేత రాజయిన దుష్యంతుఁడు వడిగలజింక చేతనువలె బలాత్కారముగా హరింపఁబడితిని." (ఇక్కడ హరింపఁబడుట అనఁగా ఆకర్షింపబడుట.

౪. ఇట్లు మధురములును గావ్యార్థసూచకములు నైన శ్లోకములచే రంగము నలంకరించి యేదే నొక ఋతువు గారణము జేసికొని భారతీవృత్తి నాశ్రయింపనగు.

ఇట్లు స్థాపకుఁడు చెవికింపుగా నుండెడి కావ్యార్థమును పర్యాయముగాఁ దెలియఁజేయు శ్లోకములచేత (పద్యములచేత రంగము నలంకరించి, అనఁగా రంగమునందుఁ గూడియుండెడి జన సమూహమును అభిముఖముగాఁ జేసికొని యేదేనొక ఋతువును గారణముగాఁ జేసికొని 'క్రొత్తకూటమియందు కాలవిశంబమా

నౌత్సుక త్వరపడుచున్నదయ్యును వశాజుఁడయిన సిగ్గుచేత వెనుకకు మరల్పఁబడుచుఁ దన చెలికత్తెలు కొందఱగు వారి మాటలచేతఁ సుముఖురాలై పేనుగఁగుర్పొడవఁగా ఎదుటనున్న వరునిఁ జూచి జంకి నవ్వుచున్న వరునిచేఁ గౌఁగలింపఁబడిన పార్వతీదేవి మిమ్ము నేలుఁగాక." ఇత్యాద్యర్థముగల పద్యములచే భారతీవృత్తి నాశ్ర యింపవలెను.

౫. నటాశ్రయమైన సంస్కృత ప్రాయ వాగ్వ్యా పారము భారతీవృత్తి.

నటుఁడు ఆశ్రయముగాఁ గల (నటునిచే జరుపఁబడునట్టి సంస్కృతపదములు తఱచుగాఁ గూర్పఁబడిన మాటలాడుట భారతీ వృత్తి అనఁబడును.

౬. ప్రరోచనావీథీ ప్రహసనా ముఖములు దాని కంగ ములు.

అభారతీవృత్తికి ప్రరోచన వీథి ప్రహసనము ఆముఖము అని నాలుగు అంగములు అగును

౭. ప్రశంసవలని యున్ముఖీకరణము ప్రరోచన.

ప్రశంస అనఁగా ప్రస్తుత విషయమును శ్లాఘించి చెప్పుట. దానిచేత వినువారిని అభిముఖులనుగాఁ జేసికొనుట ప్రరోచన అనఁబడును.

ఉ రత్నావళి యందు— శ్రీహర్షుఁడు నేర్పరి యైనకవి. ఈ సభ గుణముం గ్రహింపఁజాలినది. వత్సరాజు యొక్కచరిత్ర మును మనోహరమయినది. నే మన్నతో నాట్యమునందు సమరు

అగును. తలపెట్టఁబడిన ప్రతివిషయమును కోరిన కోరికలను పొందుటకుఁ జోటయియున్నది. సౌభాగ్యాతిశయమువలన ఇప్పుడిందు జత కూడిన తలయున్న గుణములును మనయిష్టము నెరవేర్చునను విషయమునఁ జెప్పవలసినదేమి గలదు." అనుటచేత నిందు ప్రస్తుతములగు వత్సరాజు కథయును దానిని రచియించిన శ్రీహర్షదేవుఁడును సభికులును నటుఁడును ప్రశంసింపఁబడుట వలన ఇది ప్రరోచన.

అ. ప్రసంగవశము వలన మీఁదఁ జెప్పఁబోవు వీథియొక్క అంగములు ఆముఖాంగములుగా నిటఁ జెప్పఁబడును.

ల. సూత్రధారుఁడు ప్రస్తుతాక్షేపియైన చిత్రోక్తిచే
స్వకార్యమును నటీ, మారిష, విదూషకులలో
నెవరినే నొకరినిగూర్చి చెప్పుట యాముఖము.

(సూత్రధారుఁడు - నాట్యమును నడుపువారిలో ముఖ్యుఁడు. వానికి సహాయుఁడు నటుఁడు. నటి = నాట్యమాడునట్టి స్త్రీ పాత్రము. ఆటాడునట్టి యాఁడుది విదూషకుఁడు = ఎప్పుడును పరిహాసపు మాటలాడుట మొదలగు వానిచే సంతోషపెట్టునట్టి నాయక సచివుఁడు; ప్రస్తుతాక్షేపి = ప్రకృతార్థమును గుఱించిన ప్రశ్నములు గలది—అప్పుడు జరుగఁబోవు కార్యమును గూర్చి అదియేమి ఇదియేమి అను ప్రశ్నములు చేయుటకు నవకాశము గలది. చిత్రోక్తి=వింతయైన మాట. ఇందు సూత్రధారుఁడు భావుఁడు అనియు, నటుఁడు మారిషుఁడు అనియుం వ్యవహరింపఁబడుదురు. సూత్రధారుఁడు ప్రకృతార్థమును గుఱించిన ప్రశ్న

ములకు సాభిప్రాయమయిన వింతమాటలతో నటిమారిషుఁడు, విదూషకుఁడు, ఈముగ్గురిలో నెవరి నేనొకరిని గూర్చి మాటలాడుట ఆముఖము అనఁబడునని యర్థము. ఈయాముఖము ప్రస్తావనయ నియుఁ జెప్పుదురు.

౯. కథోద్ఘాత ప్రవృత్తక ప్రయోగాతిశయములు
దీని కంగములు. మఱియు వీథ్యంగములు నంగ
ములగు.

ఈ యాముఖమునకు కథోద్ఘాతము ప్రవృత్తకము, ప్రయోగాతిశయము, అనునవి యంగములగు. ఇవిగాక వీథికి అంగములయిన ఉద్ఘాత్యకము మొదలగునవియును దీనికి అంగములగునని యర్థము.

౧౦. స్వేతి వృత్తమునకుఁ బోలిన వాక్యమేని వా
క్యార్థమేని సూత్రధారుఁడు చెప్పిన దాని
గ్రహించి పాత్రము ప్రవేశించుట కథోద్ఘాతము.

సూత్రధారుఁడు తాను నడపఁబోవు కథకుఁదగిన వాక్యము నైనను అట్టి వాక్యముయొక్క అర్థమునైనను చెప్పఁగా ఆచెప్పిన దానిని గ్రహించి పాత్రము రంగమునందుఁ బ్రవేశించుట కథోద్ఘాతము.

ఉ. (వాక్యమును గ్రహించి ప్రవేశించుటకు) రత్నావళి యందు యౌగంధరాయణుఁడు ..శీఘ్రముగఁ దెచ్చి యొసఁ. గూర్చును. (చూ. బీజము నుదాహరణము) వాక్యార్థములకు

గ్రహించి ప్రవేశించుటకు వేణీసంహారమునందు.—'భీమసేనుఁడు పగవారనెడి నిప్పును ఆర్పువారయిన పాండురాజు కొడుకులు పగవారిని జంపి కృష్ణునితోఁగూడి సంతోషింతురు గాక నెత్తుటిచేత నలంకరింపఁబడిన వారును గాయములు తగిలిన దేహములుగల వారునైన ధృతరాష్ట్రుని కొడుకులు (పరలోకమునందు) నెమ్మది నొందినవారగుదురుగాక (అర్థమును గ్రహించి ప్రవేశించుటకు) వేణీ సంహారమునందు — భీమసేనుఁడు లక్కయింట నిప్పుపెట్టియుం విషాన్నమును పెట్టియుం మాప్రాణములను, సభాప్రవేశముచేసి, మా ధనమును, అపహరింపఁదలంచిన వారును మాభార్యకట్టుకోకను తలవెండ్రుకలను, ఊడలాగినవారు నైన ధృతరాష్ట్రుని కొడుకులు నేను బ్రతికియుండఁగా నెమ్మది నొందిన వారగుదురుగాక" పైయుదాహరణములలో మొదటి దానియందు వాక్యమును రెండవ దానియందు వాక్యార్థములను మూడవ దానియందు అర్థమును గ్రహించి పాత్రము ప్రవేశించుటవలన ఇది కథోద్ఘాతమయ్యెను.

౧౧. ప్రవృత్త కాలగుణ వర్ణనముచేతఁ దెలుపఁబడు పాత్రప్రవేశము ప్రవృత్తకము.

(ప్రవృత్త కాలగుణ వర్ణనము = జరుగుచున్న కాలమునకుఁ బోలిన గుణములను వర్ణించుట.)

ఉ. ఉదాత్తరాఘవమునందు — 'ఎల్ల చుట్టములను పోషించు వాఁడయిన రాముఁడు కత్తిని ధరించి మిక్కుటమయిన తమోగుణమును బొంది యధికుఁడయిన యమునివలె భయ

మును బుట్టించెడి రావణుని నటిని దంపినట్లు, మంకెన పుష్పములం దిందుకొనఁగా మండు వెన్నెలను దాల్చి మనోహరమైన శరత్కాలము మిక్కుటమైన చీఁకటిని బొంది భయమును పుట్టించెడి వానకాలమును దొలఁగించి వెలుఁగుచున్నది." ఇందు నిర్దేశింపఁబడిన రాముఁడు జరుగుచున్న శరత్కాలమునకుఁ బోలిన గుణములచే వర్ణింపఁబడుటవలన పాత్రప్రవేశమగుటఁ బట్టి యిది ప్రవృత్తకము.

౧౨. ఇదిగో వీఁడు అనెడి సూత్రధారుని ప్రయోగమువలన నగు పాత్రప్రవేశము ప్రయోగాతిశయము.

సూత్రధారుఁడు పాత్రము నుద్దేశించి 'యిదిగో వీఁడు" అని చెప్పుచుండఁగా రంగమునందు పాత్రము ప్రవేశించుట ప్రయోగాతిశయము.

ఉ. "ఇదిగో ఈరాజైన దుష్యంతునివలె" అని శాకుంతలమునందు పాత్రప్రవేశము అగుటవలన ప్రయోగాతిశయము కానంగునది.

౧౩. ఉద్ఘాత్య కావలగిత ప్రపంచత్రిగతఛలవాక్కేళ్యధిబలగండావస్యందితనాలికాసత్ప్రలాపవ్యాహారమృదవము లని వీథ్యంగములు పదుమూడు.

౧౪. అన్యోన్య సమాలాప ముద్ఘాత్యకము.

ఒకరితో నొకరు మాటలాడుట యుద్ఘాత్యకము అనఁబడును.

౧౫. అది గూఢార్థ పదపర్యాయ మాలారూపము ప్రశ్నోత్తర మాలారూపమని ద్వివిధము.

(గూఢార్థ పదపర్యాయ మాల = అర్థము స్పష్టముగాఁ దెలియని పదములను వాని పర్యాయపదములను గూర్చిన వరుస, ప్రశ్నోత్తర మాల = అడుగుటయు బదులు చెప్పుటయునుగాఁ గూర్పబడిన పదములవరుస.)

ఉ. (గూఢార్థ పదపర్యాయ మాలారూపమునకు) విక్రమోర్వశీయమునందు - విదూషకుఁడు, 'చెలికాఁడా నిన్నుఁ బీడించునట్టి కామము అనునది యేమిటిది పురుషుఁడా స్త్రీయా? రాజు, మిత్రుఁడా మనసునందుఁ బుట్టినదియు స్వాధీనము కానిదియు సైసుఖములయందే వర్తించునట్టి స్నేహము యొక్క మనోజ్ఞమగు మార్గము కామము అనఁబడును' విదూషకుఁడు, అట్లును నేను తెలిసికొన్నవాఁడనుగాను, రాజు మిత్రమా అది మనసునఁ బుట్టినది.' విదూషకుఁడు, 'ఎవఁడు మనసున దేనిని గోరునో అది యంతయు కామమేనా' రాజు, అవును. విదూషకుఁడు. 'అట్లయినఁ దెలిసికొంటిని నేను వంట సాలయందు భోజనమును గోరుచున్నాను.' ఇందు రాజు చెప్పిన మాటలన్నియు విదూషకునికి స్పష్టముగా అర్థము తెలియని వయ్యెను. కనుక ఇది గూఢ పదపర్యాయ మాలారూపమయిన యుద్ఘాత్యకము. (ప్రశ్నోత్తర మాలారూపమునకు) పాండవానందమునందు— "గుణవంతులకు శ్లాఘింపఁదగినదియేది ? ఓర్పు ఏది కఠినము!

తనకులమువారిచేఁ జేయఁబడినది. ఏది దుఃఖము? పరులనాశ్రయించుట. లోకమునందు శ్లాఘింపఁదగినవాఁడెవఁడు? ఆశ్రయింపఁబడువాఁడు. మృత్యువేది? వ్యసనము. వ్యసనము లేని వారెవరు? ఎవరిచేత శత్రువులు జయింపఁబడుదురో వారు. ఇది యెవరిచేఁ దెలియఁబడును? విరాటునిపట్టణమునందు మఱుగు పడియున్న పాండవులచేత" ఇందు కడవెళ్లవరుసగా ప్రశ్నోత్తరములు కూర్పఁబడెను. కనుక ఇది ప్రశ్నోత్తరమాలారూపమయిన యుద్ఘాత్యకము.

౧౮. కార్యసిద్ధి యవలగితము.

౧౯. అయ్యది ఏకత్ర సమావేశమువలన నన్యత్ర కార్యసిద్ధి ప్రస్తుతమునను నన్యత్ర కార్యసిద్ధియని ద్వివిధము.

అ యవలగితము ఒకటిఁ గూడిన పని, వేఱొకట సిద్ధి ఒక పని యొక్క ప్రసక్తిచేత (సంబంధముచేత) ప్రకృతమైన పని సిద్ధి అని రెండు విధములగును.

ఉ (మొదటి దానికి) ఉత్తర రామచరిత్రము నందు — గర్భిణియైయున్న సీతయొక్క అడవి యందు విహరింపవలెనను కోరికతో సంబంధించిన విడుచుట యనెడిపని జనాపవాదము నందలి యాదరమువలన సిద్ధి (నెఱవేఱుట) అయ్యెను. (రెండవ దానికి) ఛలితరామమునందు — రాముఁడు లక్ష్మణా తండ్రి లేని యయోధ్యను జేరఁజాలను. ఇక్కడనే దిగి యుండు పోయెదను. ఎవఁడో పాదుకలకెదుట జరలును అక్షతూలయు వింజామరను

వాల్పి సింహాసనమునకు దిగువ నిలిచి వెలుఁగుచున్నాఁడు” అనుటవలన తండ్రి లేమి యొక్క సంబంధమువలన ప్రకృతమైన భరతదర్శన కార్యము సిద్ధించెను.

౧౮. హాస్యకృద సద్భూత మిథస్తోత్ర ప్రపంచము.

నవ్వును బుట్టించునదియును ఆరోగ్యమయినదియును నగు నొండొరుల పొగడుకోలు ప్రపంచము అనఁబడును.

ఉ. కర్పూరమంజరి యందు:—భైరవానందుఁడు, “బాల విధవయేని కోపముగల దుష్టస్త్రీయేని దీక్షితుని భార్యయేని మాకు అగ్నిసాక్షికముగాఁ బెండ్లాడిన పెండ్లామగును. మేము త్రాగునది మద్యము తినునది మాంసము, భోజనముచేయునది భిక్షాన్నము. పండుకొనెడి పానుపు తోలుతునక. ఇట్టి మాకులధర్మము ఎవరికి రుచ్యము గాదు.” ఇందు పరస్త్రీ ధర్మపత్నియగుట మొదలగునవి యరోగ్యవిషయములు, తమకులధర్మము రుచ్యమనుట పొగడుకోలు అని తెలియనగు.

౧౯. శ్రుతి సామ్యమువలని యనేకార్థ యోజనము త్రిగతము.

వినికి యొక్క పోలికనుబట్టి యనేకవిషయముల నూహించుట త్రిగతము అనఁబడును. (ఇది పూర్వరంగమునందు నటాది త్రితయము మాటలగు) (నటాది త్రితయము = నటుఁడు, నటి, విదూషకుఁడు అను నీముగ్గురు.

ఉ. విక్రమోర్వశీయమందు — ఇది పూఁదేనె త్రాగి మత్తెన్న తుమ్మెదల రొద. ఇది ధీరమయిన కోయిలల కూఁత. ఇది

దేవగణములచే సేవింపఁబడెడి కైలాసమునందల్ల యెడలఁ బాడు చున్న కిన్నర స్త్రీల పాటలయొక్క యవ్యక్తమధురధ్వని" ఇందు ధ్వనివినికి పోలికనుబట్టి తుమ్మెదలయు, కోయిలలయుఁ, కిన్నరస్త్రీల పాటలయు, ధ్వనులుగా నూహింపఁబడియెను. (ఇది పూర్వ రంగాంగమును ప్రస్తావనాంగమునగు.)

౨౦. ప్రియములను బోలిన యప్రియములచే నాస
గొలిపి వంచించుట ఛలము.

ప్రియవాక్యములవలెఁ దోఁచునట్టి యప్రియ వాక్యముల చేత ఆశపుట్టించి మోసపుచ్చుట ఛలము అనఁబడును

ఉ. వేణీసంహారమునందు.—భీమార్జునులు— 'ఓ జనులారా! జూదమనెడి మోసమునకు కర్తయు లక్కయిల్లు గాల్చినవాఁడును, గర్వముగలవాఁడును, దుశ్శాసనుఁడు మొదలగు నూఱుగురు తోడఁ బుట్టువులకు అన్నయు, కర్ణుని మిత్త్రుఁడును, ద్రౌపదికలవెంట్రు కలను పయఁటను జాఱఁదీయఁ జాలినవాఁడును నైన యెవని పాండవులు దాసులో ఆరాజయిన దుర్యోధనుఁడు ఎక్కడ నున్నాఁడో చెప్పుఁడు. మేము అతనిని జూడగోరి వచ్చితిమి." ఇందు దుర్యోధనుని దోషములైన యప్రియములు వానిపొగ డ్తను తెలిపెడి ప్రియవాక్యములవలెఁ బలుకఁబడెను.

౨౧. ఛలనివివర్తనము వాక్కేళి.

పైఁదఁ జెప్పఁబడిన ఛలముయొక్క మార్పు వాక్కేళియనఁ బడును.

ఉ. ఉత్తరరామచరిత్రమునందు.— వాసంతి, "నాకు నీవే ప్రాణము, నారెండవహృదయము నీవే, నాకన్నులకు వెన్నెలనీవే, నాదేహమునందమృతమునీవే," అనునివి మొదలు అయిన ప్రియవాక్యములనేకములచేత ఏమి తెలియనిచిన్నదాని ననువర్తించిదానినే, హరిహరీ ఇంక నవతలిమాటయేల అనుటచేత సీతను అడవికి అంపఁబోవుచు రాముఁడు ఆమెనుగూర్చిపలికిన ప్రియవాక్యములు అప్రియములుగా మార్పఁబడెను.

౨౨. ఉక్తి ప్రత్యుక్తులు రెంటిమాటివలనను వాక్కేళి యగును.

వంచనను దెలిపెడి రెండుమూడు ఉత్తరప్రత్యుత్తరముల వలనను [అడుగుటయు చెప్పుటయునుగా నాడెడి రెండుమూడు మాటలవలనను] వాక్కేళియగునని యర్థము.

ఉ. రత్నావళియందు.— విదూషకుఁడు ఓమదనికా ఈ చర్చరిని శిక్షింపుము. మదనిక, ఓయి అడియాసగలవాఁడా ఇది చర్చరికాదు. ద్విపదీఖండము. విదూషకుఁడు. అట్లయిన నీఖండములచేత కుడుములుచేయఁబడునా! మదనిక కాదు ఇది చదువఁబడుచున్నది." ఇది మొదలయిన ఉక్తిప్రత్యుక్తులు మదనికా విదూషకులకు జరుగుటవలన వాక్కేళి.

౨3. స్పర్ధవలని యన్యోన్య వాక్యాధిక్యోక్తి యధిబలము.

పోటిచేత ఒకరిని మించి యొకరాడెడి హెచ్చుమాటలు అధిబలము అనఁబడును.

ఉ. వేణీసంహారమునందు.—అర్జునుఁడు— 'ఎవనియందు విరోధులు సకలశత్రువులను గెలుచునట్టి యాశనుంచుకొని యుండిరో, ఎవనిగర్వముచేత లోకము తృణమువలెనే అవమానింపఁబడెనో, అట్టికర్ణుని యుద్ధరంగమునందుఁ జంపినపాండురాజకొడుకులలో నడిమివాఁడైన యర్జునుఁడు తల్లిదండ్రులను మిమ్ము మ్రొక్కుచున్నాఁడు." అని మొదలుపెట్టగ దుర్యోధనుఁడు భీమునితో ఓరీ నీవు నీవలెపొగడుకొని ప్రజలు పలుకువాఁడవుగాను మఱియేమియన, నా గదచేతఁ బగుల్పఁబడిన ఱొమ్మునందలి రోమకల బంధులు వదలుటచేత భయమును బుట్టించుచు పెద్దనిద్దురపోయిన నిన్ను శివములుగానే నీచుట్టములు చూడఁగలరు" అనుట తుదగా ముగిసిన భీమదుర్యోధనుల పరస్పరము పొగడుకొనుటకు దలిపెడి హెచ్చుమాటలవలన ఇది యధిబలము.

## ౨౮. త్వరతోడి ప్రస్తుతసంబంధి విభిన్నార్థవచనము గండము.

త్వరపాటుతోఁగూడిన ప్రకృతవిషయమునకు సంబంధింపని ఇతరవిషయమైనమాట గండము అనఁబడును.

ఉ. ఉత్తరరామచరిత్రమునందు.— రాముడు 'ఇది ఇంటిలోనిలక్ష్మి. ఇది కన్నులకు అమృతపువత్తి. దీని యొసోఁకుడు దేహమునందుఁ బూయఁబడిన మంచిగంధపుద్రవము. ఈ బాహువు కట్టివేరువలె చల్లనై మెడనుండెడి ముత్యాలపేరు. ఇట్టి దీని సంబంధమైనది యేది యసహ్యమగును. ఎడఁబాటు

ఒకటియే యనవ్యాయము." ద్వారపాలకుఁడు (ప్రవేశించి) 'స్వామీ వచ్చినాఁడు. రాముఁడు— ఓరీ యెవఁడు. ద్వారపాలకుఁడు—దేవరవారిదగ్గఱనుండు పరిచారకుఁడు దుర్ముఖుఁడు" అనుటచేత ప్రస్తుతవిషయమైన సీతావిరహమునకు సంబంధించు ద్వారపాలకనిరాశయు పరిచారకునిరాశయుఁ జెప్పఁబడెను కనుక గండము.

౨౫. రసోక్తమున కన్యథావ్యాఖ్య యవస్యందితము.

శృంగారాదిరసము తోఁచునట్లు చెప్పఁబడినమాటకు వేఱు విధముగా నర్థము చేయుట అవస్యందితము అనఁబడును.

ఉ. ఛలితరామమునందు.— సీత! అబ్బీ తెల్లవాఁడగదా మీ రిద్దఱును అయోధ్యకుఁ బోవలసినది! అట్లయిన రాజు వినయముతో మ్రొక్కఁదగినవాఁడు. లవుఁడు, అమ్మా మే మేమి రాజు నమసరించి బ్రతుకువారము కావలెనా! సీత, కుమారా ఆయన మీకు తండ్రి కాదా? లవుఁడు మాకు రఘుపతియా తండ్రి! సీత (జంకుతో) నాయనా మీకే కాదు సమస్తభూమికిని." ఇందు రఘుపతియా తండ్రి యనుపెద వేఱుగా అర్థము చేయఁబడెను.

౨౬. అపహాస సహిత నిగూఢార్థ ప్రహేళిక నాళిక.

దేహము అదురఁగా నవ్వెడి నవ్వుతోఁగూడినదియు మఱుఁగైన యర్థముగలదియునగు వాక్యము నాళిక యనఁబడును.

ఉ. ముద్రారాక్షసమునందు— చారుఁడు, "ఓయి బ్రాహ్మణుఁడా కోపింపకుము. మీయుపాధ్యాయునికి గొన్ని తెలియును.

కూవంటివారికిని గొన్ని విషయములు తెలియును." శిష్యుఁడు "నీవేమి మా ఉపాధ్యాయుల సర్వజ్ఞత్వమును అపహరింపఁ గోరుచున్నావు." చారుఁడు, మీయుపాధ్యాయుఁడు సర్వము తెలిసినవాఁడైనయెడల చంద్రుఁడు ఎవనికి అనిష్టుఁడో తెలిసికొనును. శిష్యుఁడు, ఇది తెలిసియుంటచేతఁ బ్రయోజనమేమి" అని యారంభించుటయందు చాణక్యుఁడు చంద్రగుప్తుని విరోధులెవరో తెలిసికొనునని చారుఁడు చెప్పినయర్థమును గ్రహించెను. ఇందు చాణక్యునికే గాని ఇతరులకుఁ దెలియనియర్థముగలవాక్యము చారునిచేఁ జెప్పబడెను గనుక ఇది నాళిక.

## ౨౭. అసంబద్ధకథాప్రాయమైన మాటల కూటువ యసత్ప్రలాపము.

పరస్పరసంబంధములేక కథవలెఁ జెప్పఁబడునట్టిమాటల సముదాయము అసత్ప్రలాపము అనఁబడును. ఇట్లు చెప్పుటచేత సంబంధవర్జితమనెడి వాక్యదోషము గ్రాహ్యము కాదు సంబంధములేమి యేవిభాగములుగాఁగల బ్రవ్వి దేహము తెలియనివాఁడు పిచ్చివాఁడు, పసిబిడ్డ మొదలగువారియర్థము లేనిమాటలు ఇట్టి గ్రాహ్యములు.

ఉ. వాసుకినోటిని నెలవులవరకుఁ జీలదీసి విషముచేత చిత్రవర్ణములగల మొలకపండ్లనుబట్టి శ్రేణిలో ఒకటిమూడుతొమ్మిది యేడు అనుని సంఖ్యాక్రమము లేక యెంచునట్టి కుమారస్వామి యొక్క పసితనమునందలి వచ్చిరానిమాటలు మిమ్ము సంతుష్టి సేయుఁగాక.

"మీమాంసా శాస్త్రియుఁరాలినదళ నీచే నపహరింపఁబడెను దానినిమ్ము, అపహరింపఁబడినవస్తువుయొక్క యంశ మెవనివద్ద నుండునో వాఁడే దానినంతయు నియ్యఁదగినవాఁడు,

పర్వతములు నాచేఁ దినఁబడెను. అగ్నితో స్నానముచేసితిని. ఆకాశమును త్రాగుదును. హరిహర హిరణ్యగర్భులు నాకొడుకులు కనుక సేవాడెదను."

ఈయుదాహరణములందు పరస్పరసంబంధము లేక యర్థము లేనిమాటలు కథవలెఁ జెప్పఁబడెను. కనుక ఇది యసత్ప్రలాపము.

౨౪. అన్యార్థముతోఁడి హాస్యలోభకరవచనము వ్యాహారము.

ప్రకృతార్థమునకంటె నితరమైనయర్థముతోఁ గూడిన నవ్వులాటగా నాడెడి వెరసుపుమాట [?] వ్యాహారము అనఁబడును.

ఉ. మాళవికాగ్నిమిత్రమునందు.— లాస్యప్రయోగమయిన పిమ్మట మాళవిక బయటపోవుచుండగా, విదూషకుఁడు "నీవు పోఁగూడదు. క్రమమయిన యుపదేశమునుపొంది పిమ్మట నీవు పొమ్ము. అనియుపక్రమింపఁగా, గణదాసుఁడు, అయ్యా నీకుఁ దోఁచిన క్రమభేదమేదో చెప్పుము. విదూషకుఁడు ప్రథమ ప్రయోగమునందు బ్రాహ్మణపూజనదపులేసినది [?]. అది యీమె మఱచెను అనఁగా మాళవిక నవ్వెను." ఇందు నాయకునికి ప్రియనాయికయొక్క దర్శనమును ఒడఁగూర్ప నవ్వులాటగా వేఱర్థముతో వంచించునట్టిమాటను విదూషకుఁడు చెప్పెను.

౨౫. దోషగుణములు గుణదోషములగునేని మృదవము.

దోషము గుణముగాను గుణముదోషముగాను, గ్రహించుట వృదవము అనఁబడును.

ఉ. శాకున్తలమునందు.— మెదడు చెదరుటవలనఁ గడుపు సన్నగిలి తేలికై దేహము లేచి పరుగెత్తుటకుఁ దగినదగుచున్నది. వెలుపుల కోపమును బొందిన మృగములవలెనైన మనోవికారము తెలియఁబడుచున్నది కనుక వేటయొక వ్యసనము అనుటయబద్ధము ఇట్టి వినోదము ఇఁక నేది?" అనుటచేత సప్తవ్యసనములలో నొకటయిన వేట దోషమయ్యును గుణముగా గ్రహింపఁబడెను — "ఎల్లప్పుడును మనసునకు సుఖము లేక అనేకవిధములయిన యూహాపోహములవలని కలఁతపాటును నిద్రలేమియుఁ గలిగి నమ్మరానిదైన ప్రభుత్వమునందు ఇచ్ఛగల యీరాజు జీవించుచున్నాఁడు అనుటచేత రాజునకు ముఖ్యగుణమయిన రాజ్యము దోషముగా గ్రహింపఁబడెను — మంచినడవడియు ఘనతయుం దాస్త్రీయుం ఎల్లరొండెలను జనులవలని యపవాదమునకు పాలగుచుండుఁగల సత్పురుషులు బహునిర్బంధములుగలిగి దుఃఖములో జీవించుచున్నారు. శాస్త్రజన్యజ్ఞానము లేనివాఁడును, మంచి చెబ్బరలను గలతనొందనివాఁడును ఇదియది ఇదియదికాదు అను తెలివిలేనివాఁడునంయిన పామరుఁడు కృతార్థుఁడై వర్తిల్లుచున్నాఁడు. అనుటచేత సత్పురుషగుణము నెడ దుఃఖజీవిత్వదోషమును పామరజనదోషము నెడ ధన్యత్వగుణమును గ్రహింపఁబడెను.

ఇవి ప్రస్తావనాంగములు.

౩౦. సూత్రధారుండు వీననన్యతమంబున నర్థపాత్రం బుల నాక్షేపించి ప్రస్తావనాంతంబున నిర్గమింప నగు.

నాటకమునందు సూత్రధారుఁడు మీఁదఁ జెప్పఁబడిన ప్రస్తావనాంగములయం దేదేనొకదానిచేత కావ్యార్థమును పాత్రమును ఆక్షేపపూర్వకముగ సూచించి ప్రస్తావనయయినతోడనే వెడలి పోవలెను.

౩౧. పదంపడి వస్తువు విస్తరింపందగు.

అట్లు ప్రస్తావనఁ గావించి సూత్రధారుఁడు వెడలిపోయిన పిమ్మట కథాశరీరము జెప్పఁబడవలయును.

౩౨. ఇందభిగమ్యగుణయుక్తుండు ప్రతాపవంతుండు కీర్తికాముం డధికోత్సాహుండు వేదోక్తధర్మ పరిపాలకుండు నరపాలకుండు ధీరోదాత్తుండు నాయకుండగు.

ఈనాటకమునందు పొందఁదగిన గుణములతోఁగూడినవాఁడును కోశలమువలని తేజస్సుగలవాఁడును కీర్తిని కోరువాఁడును అధికమైన పూనికగలవాఁడును వేదమునందుఁ జెప్పఁబడిన ధర్మములనుగాపాడువాఁడును ధీరోదాత్తనాయకుండునగు రాజు కథానాయకుఁడు కావలయు.

౩౩. ఆతఁడు ప్రఖ్యాతవంశరాజర్షి యేని దివ్యుండేనిఁ గావలయు.

ఆనాయకుఁడు ప్రసిద్ధమయిన వంశమునందుఁబుట్టిన రాజఋషియైనను దివ్య(దేవజాతి) పురుషుఁడైనను గావలయును.

౩౮. ఇతివృత్తం ప్రఖ్యాతం బాధికారికంబు విని యోజ్యంబు.

ఈనాటకమునందు ప్రసిద్ధములయిన రామాయణాది గ్రంథములనుండి గ్రహింపఁబడినదియును ఫలపర్యంతము అధికారిచేతఁ గాని అధికారముచేతఁగాని పొందింపఁదగినదియునైన కథాశరీరము వినియోగింపఁదగును

౩౯. నాయకరసంబుల కించుక యనుచితంబు విరుద్ధంబు.

అయ్యది త్యాజ్యంబే నన్యంబేనగు.

నాయకునకుఁగాని రసమునకుఁగాని దగియుండని యాకథాశరీరము నాటకమునకు పనికిరాదుగనుక అది విడువఁదగినది. అట్లుకానిపక్షమున వేఱువిధముగా మార్పఁదగినది అగును.

ఉ. ఉదాత్తరాఘవమునందు రాముడువాలిని వంచనచేఁ జంపెనను విషయము విడిచిపెట్టఁబడెను. మహావీరచరితమునందు వాలి రావణునివలని మైత్రిచేత రామునిఁజంపవచ్చి ఆయనచేతఁ జంపఁబడినట్లు మార్చి చెప్పఁబడెను.

౩౬. ఇట్లాద్యంతములు నిశ్చయించి తొలుత నైదు విధముల విభజించి పిదపఁ దద్విభాగంబులతోడ సంధిపంచకంబు విభాగింపనగు.

ఈమీఁదఁ జెప్పిన చొప్పున ననుచితమైన రసవిరోధమును దొలఁగించుటచేత పరిశుద్ధముగాఁ జేయఁబడినకథయొక్క తుద మొదళ్ళను నిర్ణయించి, తొలుత, సూచనీయ దర్శనీయ భేదములచే విభాగించిన యావిభాగములవలని ప్రయోజనములకుఁదగి నట్లు బీజబిందుపతాకా ప్రకరీకార్యలక్షణములనెడి అర్థప్రకృతుల నైదవస్థలకు ననుగుణముగా అయిదువిధముల విభాగింప వలెను. అటుపిమ్మట ప్రతివిభాగముయొక్కయు పండ్రెండు పదు మూఁడు పదునాలుగునైన యంగసంజ్ఞలయొక్కయు, సంధుల యొక్కయు విభాగము చేయవలయును.

3౭. ఆచతుష్షష్ట్యంగములు యథాలాభాంగములతోఁ
బ్రాసంగికేతివృత్తమున సంధియగు ప్రకరీతివృత్త
ముం బ్రధానేతివృత్తముతోడఁ గూర్పనగు.

మీఁదఁ జెప్పఁబడిన పంచసంధులయొక్క యఱువదినాలుగు అంగములను దొరికినన్ని యంగములతోడ బ్రాసంగిక కథాశరీర మును, ఒకటి రెండు మూఁడు నాలుగు సంధులచేఁ దక్కువబడిన పతాకయనెడి కథాశరీరమును, ప్రధానకథకు విరోధములేకుండ దానియంగములను పూర్ణములైన సంధులులేని ప్రకరియనెడి కథాశరీరమును ప్రధానమయిన కథాశరీరముతోడఁ గూర్ప వలయును.

3౮. ఇట్టి యీ విభాగమునం దొలుతఁగార్యయుక్తి
వలన విష్కంభమేని యంకమేని కావింపనగు.

(ఇట్టి కార్యయుక్తియనఁగా కోరినదాని వదలి చేయువస్తువిస్తరము (కథను పెంచిచెప్పుట)చేత కథ నీరసమగును గనుక కోరఁబడినదానిఁదలఁచి మిగతను విష్కంభముచేతఁ జూపవలయును అట్లుచేయ నెడల కథ మొదటినుండి సరసమయి యుండును. దాని వలన ఆముఖాక్షేపమునకు ఆశ్రయమైన యంశము ముందే యేర్పడునను అనుట) ఇట్టికార్యయుక్తివలన నీవిభాగమునందు మొదట విష్కంభముగాని అంకమునుగాని చేయవలెనని యర్థము.

౩౯. బిందువ్యాప్తి పురస్కృతమును నానావిధార్థసంవిధాన రసాశ్రయమయిన ప్రత్యక్ష నేతృచరితమంగము.

అవాంతరబీజమైన బిందువుయొక్క వ్యాప్తి కలదియు ముందుగలదై యనేకవిధములయిన ప్రయోజనముల చేరికవలన శృంగారాది రసమునకుఁ జోటయి ప్రత్యక్షమయిన ధీరోదాత్తాది నాయక చరిత్రము అంకము అనఁబడును. (అంకము = ఒడివంటిదని యర్థము)

౪౦. ఇందు ననుభావవిభావస్థాయిభావవ్యభిచారిభావములచేతఁ బరస్పరవ్యతికీర్ణములయిన యంగుల పోషణంబు కర్తవ్యంబు.

ఈయంకమునందు ఒండొంటిఁగలసి మెలుపరుపరాని యనుభావ విభావస్థాయిభావ వ్యభిచారిభావములచేత అంగులు అనఁగా అవి యంగములుగాగల రసస్థాయిభావములయొక్క పోష

ఇయుంతర్వక చేయుచున్నది. భావము = అనుటవర్తించునట్టివిష యములకు సాపేక్షమయిన మనోవికారముయొక్క ప్రకాశము. అనుభావము = భావముయొక్క చక్కనితోఁపిక. విభావము = రసముయొక్క పుట్టుకకుఁ గారణము స్థాయిభావము = స్వస్వ రూపముచెడక వర్తించునట్టి రత్యాదిభావము. వ్యభిచారిభావము = రతి మొదలయిన స్థాయిభావములకు అభిముఖముగా సంచరించు భావము. ఇట సంచరించుట యనఁగా సముద్రముయొక్క అలల వలె రసమునందు ఉప్పొంగుచు నణఁగుచు వర్తించుట.

౮౧ రసాతిశయవస్త్వలంకార లక్షణంబులంబట్టి వస్తు రసంబులు దూరవిచ్ఛిత్తి తిరోధానంబులం బొందఁ బోలదు.

వర్ణనాదులచే రసమును అతిశయిల్లఁజేయుటవలన కథాసంబంధము ఎడఁబడిపోఁగూడదు. కథయొక్క సంధులు అంగములు ఉపమాద్యలంకారములు మొదలగు లక్షణములచేత కథయందు రసము తోఁచక పోఁగూడదు అనగా కథాసంబంధమును రసమును స్పష్టముగాఁ దోఁచుచుండవలయునని యర్థము.

౮౨. వీరశృంగారములలో నేదేనొక రసమంగీకరింప నగు.

నాటకమునందు వీరరసము శృంగారరసము ఈ రెంటిలో నేదైన నొకరసము ముఖ్యముగా గ్రహింపదగును.

౮౩. అన్యములన్నియుఁ దదంగములందద్భుతంబు నిర్వహణంబు ననంగంబగు.

ఇతరములైన కరుణ మొదలగు రసములు ప్రధానరసమునకు అంగములుగా గ్రహింపఁదగును. అందుకు అద్భుతరసము నిర్వహణమునందే గ్రాహ్యము

౪౪. దూరాధ్వాదులు ప్రత్యక్షనిర్దేశ్యంబులు కావు.

దూరమార్గప్రయాణము వధము యుద్ధము రాజ్యము దేశము మొదలగువాని యుపద్రవము ముట్టడి భోజనము స్నానము సురతము గంధపుపూఁత వస్త్రములుధరించుట మొదలగునవి దూరాధ్వాదులు. వీనిని అంకమునందుఁ బ్రత్యక్షముగా జూపఁదగదు. అనఁగా ప్రవేశకాదులవలన సూచింపవలయు నని యర్థము.

౪౫. అధికారివధము త్యాజ్యమావశ్యకంబు త్యాజ్యంబుకాదు.

అధికారియైన నాయకునిచంపుట ప్రవేశకాదులవలనఁ గూడ సూచింపరాదు. దేవపితృకార్యాదులు అవశ్యకంబులగు నెడల ఒకానొకప్పుడు సూచింపకపోనుకూడదు. సూచింపనే సూచింపవలయునని భావము.

౪౬. ఏకాహాచరితంబేకార్థమాసన్న నాయకంబు త్రిచతుష్పాత్రకంబంకంబు.

ఒకదినము నడచఁదగిన కథగలదియు ఒకప్రయోజనముగలదియు సమీపించిన నాయకుండుగలదియు బహుపాత్రములులేక మూడు నాలుగుపాత్రములయొక్క ప్రవేశముగలదియు అంకమగును.

౪౭. అంకాంతంబున సర్వపాత్రనిర్గమంబు కార్యంబు.

**అట్టి యంకము తుదిని ఎల్లపాత్రములును తప్పక నిర్గమింప వలయును. అనఁగా రంగమునుండి వెడలిపోవలయును.**

౪౮. పతాకాస్థానకయుక్తంబులు బీజవదంతంబులు. ప్రవేశాది పురస్కృతంబులును గానంకంబులు కర్తవ్యంబులు.

**అంకములు పతాకాస్థానకములతోఁ గూడినవియు బిందుబీజములు తుదలయందుఁగలవియును ప్రవేశము మొదలగునవి ముందుఁగలవియునుగాఁ గావింపఁదగినవి.**

౪౯. నాటకము పంచాంకమవరము దశాంకము పరము.

**ఈమీఁదఁ జెప్పఁబడిన లక్షణములు గలనాటకము తక్కువ పక్షము అయిదంకములును హెచ్చుపక్షము పదియంకములు గలదియునగు. అనఁగా నాటకము అయిదంకములకుఁ దక్కువ పడకయు అయిదింటిమీఁదఁ బదియంకములకు మించకయుండు నట్లు రచింపవలయు. మూఁడునాలుగంకములలో రచియింపఁ గూడదు. అట్లే పదునొకండు పండ్రెండంకములలోను రచియింపఁగూడదు. అని తాత్పర్యము. ఆ ఇతరభేదముల వేఱు పాటు తెలియుటకై ఇటనాటకస్వరూపమును దెలియఁజేయఁ బడుచున్నది.**

౫౦. అయ్యది స్త్రీపాత్ర బహుళంబు లలితనాయకంబు.

శృంగారవంతంబు చతురంక పరిమితంబు నాటికి యగు.

ఆ నాటకము స్త్రీపాత్రములు తఱుచుగాఁగలదియుం ధీరలలితుండు (మన్మథస్థితియు, భోగాసక్తియుం సౌందర్యమునుగలిగి మానినీవశుఁడైననాయకుఁడు) నాయకుఁడుగాఁ గలదియు, కేవలశృంగారరసముగలదియుం నాలుగంకములుగలదియుం నగు దాని నాటికయనంబడు. [అయిదంకములు గలదియుం నాటికయగునని రత్నావళి నాటకమును నాటికయని కొందఱు వాడెదరు.]

౫౧. స్త్రీప్రాయచతురంకాదిభేదకంబయ్యు నేకద్వి
 త్ర్యంకపాత్రాదిభేదంబుచేతను బహుభేదకంబగు.

ఇది నాటికయనెడి స్త్రీసమాఖ్యనొందుటవలన దీనియందు స్త్రీప్రధానత్వ మంచితము. అట్లు తఱుచుగా స్త్రీప్రాధాన్యమును నాలుగంకములే యుండవలయుటయు ననుభేదమున్మాత్రము కలిగియుండుటగాక ఒకటి రెండుమూడు అంకములయందు పాత్రములు మొదలగువాని భేదముచేతను నాటకమునకంటె బహుభేదములుగలది నాటికయగు.

౫౨. అందు రాజవంశజాతయు గంభీరయు మానిని
 యు జ్యేష్ఠయునగు ప్రగల్భ దేవియగు.

రాజవంశమునందు బుట్టినదియుం ముఖవికారాదులచే అభిప్రాయము బయలుపడనీనిదియు, కోపస్వభావముగలదియుం జ్యేష్ఠయుం (నాయకునికైన యధికప్రీతికిఁ బాత్రురాలును)

ప్రగల్భయు (నిండిన యౌవనముచే మసలుచు మన్మథవ్యాపార పారంగతరాలై వర్తించునది) అగు నాయిక రాణియగు.

౫౩. నేతృసంగమంబు గష్టంబువలనం దదన్యాశ్రితగు.

ఆరాణి యధీనురాలయిన మంతిరియొకకన్యకకు గష్టమువలన నాయకునితోడి కూడికయగును

ఉ రత్నావళియందు రాణియైన వాసవదత్తకు అధీనురాలై యున్న సాగరికకు బహుకష్టములుపడిన మీదట వత్సరాజుతోడి కూడిక యయ్యెను

౫౪. ప్రాప్యయుఁ బ్రధాననాయికను బోలినదియు దివ్యయు నతిమనోహరయునగు ముగ్ధ కాఁదగు.

అట్లు నాయకునిఁ బొందఁదగిన నాయికయుం బ్రధాననాయిక వలెనే రాజవంశమునందుఁ బుట్టినదియుం గంభీరయుం సామాన్యురాలుగానిదియుం మిక్కిలియందగత్తెయుం నైన ముగ్ధక వలయుంచు. (ముగ్ధ = పుట్టుచున్న యౌవనముగలదియుం మన్మథవ్యాపారము తెలియనివానియందు నేర్పులేనిదియుం నైన నాయిక)

౫౫. అది యంతఃపురాదిసంబంధమువలన నాయకుని సమీపించినదియు శ్రుతిదర్శనాదులచేత నాయకునికి నుత్తరోత్తరము నవీనాను రాగమును బెంచునదియునగు నేనియు నేత దేవీత్రాసశంకితుండై వర్తించు.

ఆముగ్ధయైన నాయిక యంతఃపురమునందలి సంగీతము మొదలగువానిసంబంధమువలన సమీపించునదియుఁ నట్టిదట్టపు విరుచు

చూచుట మొదలగువానిచే నాయకుని స్త్రీయనురాగము మీఁదమీఁదఁ బెరుఁగఁ జేయఁ బడియుండినను, నాయకుఁడు రాణి వలని భయముచేత దానిఁ జేరకయే యుండును.

౧౬. నాటిక కైశిక్యంగచతుష్టయాంకయుక్తంబ యగు.

నాటిక త్రియంకమునందును గూర్పఁబడిన కైశిక్యంగములు నాలుగింటితోడను గూడినదియే యగును.

౧౭. సుకుమారపదమధురార్థలలితబంధశృంగారకరు
ణారసంబులు కైశిక్యంగంబులు.

మిక్కిలి మృదువైనపదములు, ఇంపైనయర్థము చక్కనైన కూర్పు, శృంగారకరుణారసముల కలిమి అనునీనాలుగును కైశికీ వృత్తికి అంగములు ఈనాలుగంగములును నాలుగంకముల యందుఁ బొందుపడవలయును.

ఇంక ప్రకరణ ప్రకారము

౧౮. ప్రకరణంబున నితివృత్తముత్పాద్యంబు లోక
సంశ్రయంబగు.

ప్రకరణమునందు లోకానువర్తనమే ఆశ్రయముగాఁ గల కల్పితమైనకథ చెప్పఁబడవలయును.

౧౯. నేత యమాత్యవిప్రవణిజులలో నొక్కఁడు
ధర్మకామార్థతత్పరుం డపాయసంహితుండు ధీర
శాంతుండు కాఁదగు.

అందు నాయకుడు మంత్రి బ్రాహ్మణుడు వణిజుడు (వర్తకుఁడు) లోనగువారిలో నెవ్వఁడయిన నొకఁడు కావలయును. వాఁడు ధర్మకామములయందు దాసక్తిగలవాఁడును అపాయములు [ఇడుములు] కలుగుటచేత కార్యసిద్ధినొందఁగలవాఁడును నైన ధీరశాంతుఁడు గావలయును (ధీరశాంతుఁడు = చక్కఁదనమును పరిశుద్ధతయు వివేకమును అభిమానమును తిన్నఁదనముగల బ్రాహ్మణాది వంశములందుఁ బుట్టిన నాయకుఁడు.

౬౦. సంధిప్రవేశక రసాదికము నాటకవద్గ్రాహ్యము.

ముఖము మొదలగు సంధులును ప్రవేశము మొదలగు కథాసూచనచేయుమార్గములును రసములులోనుగాఁగల తక్కినవిషయములును నాటకమున కెట్లో అట్లే దీనికిని గ్రహింపఁదగినవి.

౬౧. నాయిక కులస్త్రీయేని గణికయేని యుభయలేని కాఁదగు.

ప్రకరణమునందు నాయిక కులస్త్రీ (ఇల్లాలు)గాని బహిరాంగ్యురాలయిన వేశ్యగాని కులస్త్రీవేశ్య లిరువురునుగాని కావచ్చును.

౬౨. కులస్త్రీ యాభ్యంతర బాహ్య యని ద్వివిధ యగు.

ప్రకరణమునందు నాయికగా గ్రహింపఁదగిన కులస్త్రీ అభ్యంతర [కులధర్మమునకు వెలికానిది] బాహ్య [కులధర్మమునకు వెలియైనది] అని రెండువిధములుగలది యగును.

౬౩. వారిం బోలినదియు వేశ్యయు నగు.

కులస్త్రీ యాభ్యంతరయగునని యాభ్యంతరను బోలినదియు బాహ్యయగునని బాహ్యను బోలినదియు వేశ్యయగునని యర్థము.
(వేశ్య-వేశము అనఁగా భోగమునకిచ్చు ధనము-అదిగలది.)

౬౪. ఏతన్నాయికాభేదంబువలనఁ బ్రకరణంబు త్రివిధంబు.

ఈ చెప్పఁబడిన నాయికల భేదమునుబట్టి ప్రకరణము మూఁడు విధములు గలదియగును.

౬౫. అందు సంకీర్ణంబు ధూర్తసంకులంబు.

కులస్త్రీయును వేశ్యయునైన యిరువురు నాయికలుగల ప్రకరణము సంకీర్ణము అనఁబడును. అట్టి సంకీర్ణప్రకరణము వంచకులు జూదరులు మొదలగు అయోగ్యుల చేరిక గలది యగును.

(కులస్త్రీయే నాయికగాఁగల ప్రకరణము పుష్పదూషితకము వేశ్యయే నాయికగాఁగలది తరంగదత్తము. సంకీర్ణము మృచ్ఛకటిక.)

అథ భాణప్రకారము

౬౬. ఎందు స్వానుభూతమేని పరకృతమేనగు ధూర్త చరితము నాయకునిచే వర్ణింపఁబడునో యది భాణము.

(స్వానుభూతము = తనకనుభవమయినది - తనచేతఁ జేయఁ బడినది. పరకృతము = ఇతరుల చేతఁ జేయఁబడినది. ధూర్తచరి

తము — దొంగ లాదరి మొదలగు వారిచరిత్రము. వర్ణించుట ఉ ల్లాఘించి చెప్పుట, భారతీవృత్తిప్రధానముగాఁగలదియగుటవలన ఇదిభాణము అను పేరుగలది అయెను.)

౬౭. ఇందు నేర్పరియుఁ బండితుఁడునైన విటుఁ
డొక్కఁడు నాయకుఁడు (స్పష్టము.)

౬౮. ఆకాశభాషితములచేత సంబోధనోక్తి ప్రత్యు
క్తులు నడపంబడు.

ఒకనియొక్క పిలిచియగుట బదులుచెప్పుట అనునవి లేక అది యెట్లు ఇదియెట్లు అకాడికంశలచేత గ్రహింపఁబడిన ఆకాశభాషితములచే నడప బడునని యర్థము.

౬౯. వీరశృంగారములిందు శౌర్యసౌభాగ్యసంస్తవం
బులచే సూచితంబులు.

ఈభాణమునందు వీరరసమును శృంగారరసమును శౌర్యమును (మగతనమును) సుభగత్వమును (అందమును) పొగడుట చేత సూచింపఁదగునవి అని యర్థము.

౭౦. ఈయది తఱచుభారతీవృత్తికల్పితవస్తుకం బేకాం
కంబునగు.

ఈభాణము పాడిరూపకము తఱచుగా భారతీవృత్తిగలిగి యయుఁ గవికల్పితమగు కథగలదియు నొక్కయంకముతో ముగి యునదియు నగును.

౨౧. సాంగంబులు ముఖనిర్వహణసంధులు లాస్యాంగంబులు పది యిందుఁ బ్రవర్తిల్లు.

అంగములతోఁ గూడిన ముఖనిర్వహణములనెడి మొదటిదియుం గడపటిదియునైన రెండుసంధులును లాస్యాంగములు పదియును ఇందుఁ గలవని యర్థము.

౨౨. గేయము పదము స్థితము పాఠ్యమాసీనము పుష్పగండిక ప్రచ్ఛేదకము త్రిగూఢము సైంధవము ద్విగూఢముత్తమోత్తమక ముక్తప్రత్యుక్తమనునీపదియు లాస్యాంగములు.

ఇంక ప్రహసనప్రకారము

౨3. తద్వత్ప్రహసనంబు శుద్ధవైకృతసంకరభేదంబు వలనం ద్రివిధంబు.

ప్రహసనము విూఁదఁ జెప్పఁబడిన భాణమువలె వస్తువు(కథాశరీరము) సంధులు వానియంగములు లాస్యాంగములును గలదై శుద్ధము వైకృతము సంకరము అను భేదములవలన మూఁడువిధములై యుండును.

౨౪. అందు శుద్ధంబు పాషండవిప్రప్రభృతిచేట చేటీవిటసంకులంబును హాస్యవచోన్వితవేషభాషాచేష్టితంబును నగు.

ఆమూఁడు విధములయం[illegible]న్ను శుద్ధము [illegible]బౌద్ధులు మొదల[illegible] గాఁగల నాస్తికులు మిక్కి[illegible]లి [illegible]

మాత్రముచేత నొకరి ననుసరించి బ్రదుకువారుగాని అయిన బ్రాహ్మణులు మొదలగువారు పనివాండ్రు పనికత్తెలు పరస్త్రీగమనముచేయువారగు నిందుకొనియుండునదియు ఎగతాళిమాటలతో గూడినవేషము భాషలు (మాటలు) వ్యాపారములును గలదియు నగును.

౭౫. కాముకాది వచోవేషులయిన షండకంచుకి తాపసాదుల ప్రవర్తనములుగలది వైకృతము.

కాముకాదులు = విటపురుషులు పోగులవాండ్రు కలారులు మొదలగువారు, వచోవేషులు = వాక్కులును వేషములును గలవారు. షండకంచుకి తాపసాదులు = నపుంసకులు అంతఃపురపుకావలివారు, తపస్సుచేయువారు మునులివారు మొదలగువారలు. వీరివర్తనములు గలది యుదో అది వైకృతమైన ప్రహసనము. ఇందు తాపసాదివేష వికృతులు గలుగుటచే నిది వైకృతమయ్యెను.

౭౬. ధూర్తసంకులంబు వీథీసంకరంబు సంకీర్ణంబు.

ధూర్తసంకులము = దొంగ జూదరి మొదలగువారి కూటమి గలది. అట్టిదానితోడ వీథ్యంగములైన యుద్ఘాత్యకాదులు గలయుకొని సంకీర్ణమగు ప్రహసనము.

౭౭. రసంబు షడ్విధంబగు హాస్యంబు.

ప్రహసనమునందు స్మితము హసితము విహసితము ఉపహసితము అపహసితము అతిహసితము అనునను భావములచేత ఆఱు విధములైన హాస్యమే యిందు వర్తిల్లునని యర్థము.

### అథ డిమ ప్రకారము

౭౮. డిమంబు ప్రఖ్యాతవస్తుకంబు.

డిమము నాటకమునవలె రామాయణాదిగ్రంథములందుఁ ప్రసిద్ధమయిన కథాశరీరము కలదియగు.

౭౯. కైశికి తక్కఁదక్కిన వృత్తులిందు గ్రాహ్యంబులు.

ఈ డిమమునందు కైశికీవృత్తి వర్తింపఁగూడదు. అది తప్పఁ దక్కిన భారత్యాదివృత్తులిందు గ్రహింపఁదగినవి.

౮౦ అత్యంతముద్ధతులు దేవగంధర్వ యక్షరాక్షస మహోరగ భూతప్రేత పిశాచాదులు పదియార్వురు నాయకులు.

మిక్కిలి నిక్కుగలవారైన దేవతలు గంధర్వులు యక్షులు రాక్షసులు మహోరగులు భూతములు ప్రేతములు పిశాచులు మొదలగువారు పదియాఱుగురు నాయకులగుదురు (డిమ సంఘాతే యని డిమధాతువునకు సముదాయమర్థము గనుక నాయక సమూహవ్యాపారాశ్రయత్వమువలన డిమమను పేరు దీనికి గలిగెను.

౮౧. హాస్యశృంగారేతరము లాఱురసములు రౌద్ర ప్రధానకంబులు.

ఈ డిమమునందు హాస్యము శృంగారము తక్కఁదక్కిన వీరము రౌద్రము బీభత్సము అద్భుతము కరుణ భయానకము అను నాఱురసములును వర్తించును అందు న్యాయము ముఖ్యముగాఁగల రౌద్రరసము ప్రధానము.

౮౨. మాయేంద్రజాలసంగ్రామక్రోధోద్భ్రాంతచేష్టిత చంద్రసూర్యోపరాగంబులనుభావంబులై వర్తిల్లు.

రౌద్రరసము ప్రధానముగాఁగల యీరసములకు మాయ (కపట), ఇంద్రజాలము (కనుకట్టువిద్య) సంగ్రామము (యుద్ధము.) క్రోధము (కోపము) ఉద్భ్రాంతచేష్టితము (మిక్కిలి భ్రమనొందిన వాని వ్యాపారము) చంద్రసూర్యోపరాగములు చంద్రగ్రహణ ములు అనుభావములై డిమమునందు వర్తిల్లును.

౮౩. విమర్శేతర సాంగ సంధి చతుష్టయంబు చతు రంకయుక్తంబు డిమంబగు.

ఈ డిమము విమర్శముతప్పఁ దక్కినయంగములతోడి ముఖ ప్రతిముఖగర్భ నిర్వహణసంధులను నాలుగంకములును గలది యయి వర్తిల్లును.

౮౪. శేషంబు ప్రస్తావనాదికంబు నాటకవద్గ్రాహ్యంబు.

మిగిలిన అనగా నిందుచెప్పఁబడని ప్రస్తావన మొదలగునది నాటకమునందువలె దీనియందును గ్రహింపఁదగినది (ఇది త్రిపుర దాహమునందు బ్రహ్మచేతఁ గల్పింపఁబడిన లక్షణము. కనుక త్రిపురదాహాదికి డిమమను పేరుఁ జెప్పఁబడెను. ఇట్లు భరతముని చేతను వ్యాజముగా త్రిపురదాహేతివృత్తమునకు తుల్యత్వము చూపఁబడెను.)

ఇంక వ్యాయోగప్రకారము

౮౫. వ్యాయోగంబు ప్రఖ్యాతేతివృత్తోద్ధతనాయ కాశ్రయంబు.

వ్యాయోగమను నొక రూపకము ప్రఖ్యాతము (ఇతిహాసప్రసిద్ధము) అయినకథాశరీరముగలదియు ప్రసిద్ధుఁడయిన ధీరోద్ధతుఁడు నాయకుఁడుగాఁ గలదియునగు.

౮౬. గర్భవిమర్శేతరంబులు సంధులు డిమవద్రసంబులునగు.

ఇందు గర్భవిమర్శసంధులఁ దక్కఁ దక్కినసంధులు మూఁడును డిమమునందువలె వీరరౌద్రబీభత్సాద్భుత కరుణాభయానకరసములును వర్తించును (ఇందు కైశికీవృత్తి వర్తింపదు.)

౮౭. అస్త్రీనిమిత్తక సంగ్రామంబు పరశురాము విజయంబుంబోలె నగు.

పరశురాముని గెలుపువలె నిందు స్త్రీనిమిత్తము కాని యుద్ధము ప్రవర్తిల్లును అనఁగా తనతండ్రిని జంపుటవలని కోపముచేతఁ బరశురాముఁడు కార్తవీర్యుని జంపిన యుద్ధము వలె స్త్రీ నిమిత్తముచేసికొన్నది కాని కోపమువలననగు యుద్ధము ఈవ్యాయోగమునందు జరుగునని యర్థము.

౮౮. అనేకజనకర్తృకం బేకాహచరితం బేకాంకంబి యది యగు.

ఇదియనేకజనులచేరి యొకనాఁడు చేయునట్టి వ్యాపారములు గలదియు ఒకయంకముతో ముగియునదియు నగును (అనేకజనులతోడిది గలది గనుకనే దీనికి వ్యాయోగమని పేరు కలిగెను.) (మిగతస్పష్టము.)

## అథ సమవకారప్రకారము

౮౯. ప్రఖ్యాతదేవాసురవస్తుకంబు సమవకారంబు.

సమవకారమనెడి రూపకము ఇతిహాసాదిప్రసిద్ధమైనదియు దేవతలసంబంధమును అసురులసంబంధమునైనదియునగు కథా శరీరము గలది

౯౦. ఇందు దేవాసురాదులు ధీరోదాత్తులు పన్నిద్దఱు నాయకులగుదురు.

ఈసమవకారమునందు దేవతలు అసురులు మొదలగువారు పన్నిద్దఱు ధీరోదాత్తనాయకులు నాయకులగుదురు.

౯౧. ఫలంబన్యోన్యంబు భిన్నంబు.

ఇందలిప్రయోజనము ఆపన్నిద్దఱు నాయకులకును పరస్పరము వేఱువేఱుగానగును. అనఁగా సముద్రమథనమునందు విష్ణువు మొదలగువారికి లక్ష్మి మొదలగుఫలములు వేఱువేఱుగా సిద్ధించినట్లు వేఱువేఱుగా సిద్ధించునని యర్థము.

౯౨. విమర్శేతరంబులు సంధులగు.

విమర్శ సంధితక్కఁ దక్కిన సంధులు నాలుగును దీనికి అగును.

౯౩. అంగభూతసర్వరసంబు వీరంబు ప్రధానంబు వృత్తులు కైశికీతరంబులు.

శృంగారాది రసములన్నియును అంగములుగాఁగలవీరము ప్రధానరసముగను కైశికీతక్కఁ దక్కినవృత్తులుగలిగియుండును

౯౪. త్రికపటత్రివిద్రవత్రిశృంగారవంతంబంక త్రయం బగు.

మూడుకపటములును మూడువిలాయనములును మూడు శృంగారములును గలిగిన మూడంకములు దీనికిఁ గలిగియుండును. (స్వభావముచేతను దైవముచేతను శత్రువుచేతను జేయఁబడినవి క్రమముగా మూడుకపటములు. అట్లే పట్టణపుముట్టడి యుద్ధము అగ్నిభయము వీనిచేనగునవి మూడు విలాయనములు. అట్లే ధర్మము అర్థము కామము అను వీనిచేత నగునవి మూడు శృంగారములు ఇవి క్రమముగా ప్రతియంకమునందును ఒక్కొక్కటి కాఁదగినవి.)

౯౫. ప్రథమాంకంబు ద్వాదశనాళికావంతంబితరం బులు చతుర్ద్వినాళికావంతంబులు.

ఇందు మొదటియంకము పండ్రెండునాళికలకాలము నడచుఁదగిన కథగలదియును రెండవయంకము నాలుగునాళికలకాలము నడచుఁదగిన కథగలదియును మూడవయంకము రెండునాళికల కాలము నడచుఁదగిన కథగలదియును కావలయును నాళికయనఁగా రెండుగడియల కాలము

౯౬. ప్రహసనంబుంబోలె వీథ్యంగంబులునిందు యథాలాభంబుగ గ్రాహ్యంబులు.

ప్రహసనమునం దట్లో అట్లు దీనియందును యథోచితముగా వీథియొక్క అంగములు గ్రహింపఁదగినవి.

౯౭. సాంగంబాముఖంబు నాటకవత్కర్తవ్యంబు.

అంగములతోఁ గూడిన యామఖము (ప్రస్తావన) నాటకము వలెనే యీసమవకారమునందును జేయఁదగినది.

## ఇంక వీథి ప్రకారము

వీథియనఁగా మార్గము. ఇట వరుసతప్పనియంగములకూర్పు గలదియని యర్థము.

౯౮. వీథియుత్పాద్యవస్తుకంబు ధీరోద్ధతనాయకంబు నగు.

ఈవీథియనెడి రూపకము కవికల్పితకథాశరీరమును ధీరోద్ధతనాయకుఁడును గలదియగు.

౯౯. భాణంబునకుం బోలె సాంగసంధ్యకంబులుం గైశికీవృత్తియు దీనికగు.

ఈవీథికి భాణమునకువలె ముఖనిర్వహణసంధులు వానియంగములతోఁ వర్తిల్లుటయు, ఒకయంకములోనే ముగియుటయు నగు. మఱియుఁ గైశికీవృత్తి దీనికగును.

౧౦౦. శృంగారరసంబు సూచ్యంబించుక రసాంతరంబు స్పర్శనీయంబు.

ఇందుఁ దఱచుగా శృంగారరసము సూచింపఁదగినదియు దానికంగములుగా నితరరసములు కొంచెము గూర్పఁదగినవియు నగు. అవి కైశికీవృత్తికిఁ దగినట్లు కూర్పఁబడవలయును.

౧౦౧. ఒకఁడొండె రెండుపాత్రంబు లిందు వర్తిల్లు.

ఈరూపకమునందు ఒకపాత్రమైనను రెండుపాత్రములైనను గలిగియుండును.

౧౦౨. నాయికయనురాగిణి పరకీయ యగు. కులస్త్రీ కాదు.

ఇందు నాయికయనురాగము గలదయిన పరకీయ యగును. (పరకీయ = పరపురుషునియం దిచ్ఛగలదియయ్యును అందులకుఁ దగిన వ్యాపారములను మఱుఁగుపఱుచుటయందు పొందినమనస్సు గలది). (కులస్త్రీ = (ఇల్లాలు) ఇందు నాయిక గానేరదని యర్థము.

౧౦౩. ప్రస్తావనముందుఁ జెప్పఁబడిన యుద్ఘాత్యకాదు లైన యంగములతోడఁ గర్తవ్యంబు.

ముందుచెప్పఁబడిన ఉద్ఘాత్యకము మొదలయినయంగములతోఁ బ్రస్తావన నడపఁదగినది.

ఇంక నంక ప్రకారము

౧౦౪. ఉత్ప్రేక్షితాంకంబునం దితివృత్తంబు ప్రఖ్యాతం బేని బుద్ధికల్పితం బేనగు.

ఉత్ప్రేక్షితమనియెడి యంకమునందుకథ ఇతిహాసాదులందుఁ బ్రసిద్ధమయినదిగాని కవి తనబుద్ధిచేతఁ గల్పించినదిగాని కావచ్చును

(ఉత్ప్రేక్షితమనుట నాటకాదులందు నప్పుడిపుడిచ్ఛేదరూపమయిన యంకము కాదని తెలియుటకు అని తోఁచుచున్నది.)

౧౦౫. నాయకులు ప్రాకృతులు రసంబు కరుణంబు.

ఇందు నాయకులు పామరులంబున జనులనేకులగుదురు. కరు
ణారసము స్థాయియై వర్తిల్లును.

౧౦౬ సంధివృత్త్యంగంబులు భాణవద్గ్రాహ్యంబులు.

భాణమునందువలె నిందును అంగములతోఁగూడిన ముఖనిర్వహణసంధులును భారతీవృత్తియు లాస్యాంగములును ఒకయంకములో ముగియుటయుం గ్రహింపఁదగినవి.

౧౦౭. స్త్రీపరిదేవన సహితవాక్కలహజయపరాజయంబులు విధాతవ్యంబులు.

ఆడువారి దుఃఖముతోడిమాటలతోఁగూడిన నోటిజగడము జయము నపజయమును ఇందు జరుగఁదగినవి యగును. ఉదా మూహ్యము.

అథ ఈహామృగప్రకారము.

౧౦౮. ఈహామృగంబు మిశ్రవస్తుకంబు చతురంకంబు త్రిసంధిమంతంబునగు.

ఈహామృగమనెడి రూపకము ప్రఖ్యాతంబును కల్పితంబునుం గూడిన కథాశరీరము గలదియు నాలుగంకములు గలదియు మూడు సంధులు గలదియు నగును.

౧౦౯. ప్రసిద్ధులు ధీరోద్ధతులు నరదివ్యులనియమంబున నాయకప్రతినాయకులగుదురు.

ఇందు ప్రసిద్ధిగలవారు ధీరోద్ధతులు నరుఁడును దివ్యుఁడు నైన నాయకులు నియమములేక ప్రధాననాయకుఁడును ప్రతి

నాయకుఁడును అగుదురు నియమములేక యనుటచేత నరుఁడు ప్రతినాయకుఁడు దివ్యుండు ప్రధాననాయకుఁడుగావలెనని గాని దివ్యుండే ప్రతినాయకుఁడు నరుఁడే ముఖ్యనాయకుఁడు కావలెనని గాని యొకనియమములేక యిరువురిలో నెవఁడే నొకఁడు ముఖ్య నాయకుఁడును మఱియొక్కఁడు ప్రతినాయకుఁడును గావచ్చునని యర్థము.

౧౧౨. అంతంబునం బ్రతినాయకుఁ డిచ్ఛింపని దివ్య
వనితనపహరించుటలోనగు విపర్యాసాదులచే
నయుక్తకారియగు.

ఈనాట్యప్రబంధమున గడపట ప్రతినాయకుఁడు తనయం దిచ్ఛలేని దేవతాస్త్రీని అపహరించుట మొదలగువ్యత్యాసవ్యాపారములచేత చెడ్డపనులు చేసినవాఁడు అగును.

౧౧౩. సంరంభం బత్యంతం బయ్యు వ్యాజంబున
యుద్ధంబు నివారింపనగు.

తొలుత మిక్కిలియాటోపముతో యుద్ధమునకుఁ బ్రయత్నపడియు నేదేనొక మిషచేత యుద్ధమును నిలుపవలయు. అనఁగా యుద్ధమును మానవలయును.

౧౧౪. వధప్రాప్తుండగు మహాత్మునివధంబు కర్తవ్యంబు
గాదు.

చంపుటకై చిక్కినట్టి దొడ్డవానిఁజంపుట చేయఁదగినది కాదు. అనఁగా చంపఁదగదనుట.

(తనకుఁ దక్కని నాయికను నాయకుఁడు మృగమును వెదకి నట్లు ఇందు వెదకును గనుక దీనికి ఈహామృగమని పేరుకలిగెను.)

నాటకాది రూపకములందెల్లయెడలను ఉత్తమపాత్రములకు సంస్కృతభాషాంశంబును సలక్షణంబునైనభాషయు, మధ్యమ పాత్రములకు వైకృతభాషాంశంబును యథోచిత లాక్షణికమునైన భాషయు, నీచపాత్రములకు శుద్ధాంధ్రమును లాక్షణికముకాని దియునైన భాషయు వినియోగించుట శోభాకరంబు.

ఇది దశరూపక సంగ్రహము.



చెన్నపురి వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము—23-7-1955

## తెనుగు నిఘంటువులు

| | రూ. | అ. |
|---|---|---|
| నానార్థనిఘంటువు, పద్యకావ్యము ... | 0 | 4 |
| శ్రీ వేంకటేశాంధ్రము, పద్యకావ్యము ... | 0 | 6 |
| ఆంధ్రనామసంగ్రహము, ఆంధ్రనామశేషము, సాంబ నిఘంటువుటీకా, అకారాద్యనుక్రమణికతో కాలికోబైండు ... | 2 | 0 |
| వావిళ్ల నిఘంటువు (అ-ఔ వరకు) I సంపుటము | 10 | 0 |
| డిటో (క - ఘ వరకు) II సంపుటము | 12 | 0 |
| డిటో (ట - న) III సంపుటము | 10 | 0 |
| శబ్దార్థచంద్రిక, శ్రీ మహాకాళి సుబ్బారాయకృత ఆంధ్రనిఘంటువు ... | 10 | 0 |
| లఘుశబ్దార్థచంద్రిక .. | 6 | 0 |
| తెనుగుసామెతలు with English Translation by Captain Carr .. | 2 | 0 |
| Gellettes' Telugu Dictionary (*Printed in Roman letters*) ... | 7 | 8 |
| Sankaranarayana's Telugu-English Dictionary. శంకరనారాయణగారినిఘంటువు తెనుగు పదములకు ఇంగ్లీషు అర్థముగలది | 12 | 0 |
| Sankaranarayana's English Telugu Dictionary. శంకరనారాయణగారి నిఘంటువు (ఇంగ్లీషు పదములకు తెనుగు అర్థముగలది) | 15 | 0 |

4 ప్రతి 1-8 రూ

| | | |
|---|---|---|
| English-Telugu Pocket Dictionary | | |
| ఇంగ్లీషు-తెలుగు పాకెట్టు డిక్షనరి ... | 5 | 0 |
| Translation Guide (English to Telugu & *Vice-Versa* (useful for Revenue Officials) ... | 2 | 8 |

## —●● నాటకములు ●●—

| | | |
|---|---|---|
| ఆంధ్రప్రసన్నరాఘవనాటకము ... | 1 | 0 |
| ఎలెక్షన్ ప్రహసనము .. | 0 | 2 |
| కమలాపహరణము టి. సి. వి. శ్రీనివాసాచార్య | 1 | 4 |
| కన్యాశుల్కము గురజాడ అప్పారావుగారిది ... | 2 | 0 |
| కృష్ణకుమారినాటకము ... | 0 | 10 |
| చినరంగారాయనాటకము ... | 0 | 6 |
| నరకాసురవిజయవ్యాయోగము ... | 1 | 0 |
| నందునిచరిత్ర, వేదం వేంకటాచలయ్యది ... | 0 | 12 |
| పాండవాజ్ఞాతవాసము . | 0 | 12 |
| పూర్వశాకుంతలము ... | 0 | 12 |
| విచిత్రపాదుకాపట్టాభిషేకము ... | 0 | 12 |
| విధిలేకవైద్యుడు .. | 0 | 10 |
| వీరాభిమన్యునాటకము ... | 0 | 12 |
| శాకుంతలనాటకము, రాయమూర్గము నరసయ్యగారిది | 1 | 4 |
| శారదాబిల్లి పాకప్రతి ... | 0 | 12 |
| శ్రీరామవనవాసనాటకము ... | 0 | 12 |

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,
పోస్టుబాక్సు 1372 292 ఎస్ప్లనేడ్, చెన్నపురి. 1.